# శ్రీ సీతారామవియోగము

గ్రంథకర్త:
కీర్తిశేషులు శతావధాని బాలసరస్వతి
మల్లాది గోపాలకృష్ణశాస్త్రి.

ప్రకాశకుడు:
కనుపర్తి కోటయ్య.
బుక్కుసెల్లర్, బెజవాడ.





శ్రీ

# సీతారామ వియోగము.

గ్రంథకర్త:

కీర్తిశేషులు శతావధాని, బాలసరస్వతి

మల్లాది గోపాలకృష్ణశాస్త్రిగారు

Malladi Gopala Krishna Sastri



మొదటి కూర్పు 1000 ప్రతులు.

ప్రకాశకుడు:

కనుపర్తి కోటయ్య,

బుక్కుసెల్లర్, బెజవాడ.




బెజవాడ:

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్) యందు

క. కోదండరామయ్యగారిచే

ముద్రింపబడినది.

1927.


 [వెల రు 1—0—0.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు





## — పురుషులు —

రాముఁడు
లక్ష్మణుఁడు
విరాధుఁడు
జటాయువు
ఖరుఁడు



దూషణుఁడు
త్రిశిరుఁడు
రావణుఁడు
మారీచుఁడు

సందర్భానుసారముగ మరికొందరు వత్తురు.

## — స్త్రీలు —

సీత
శూర్పణఖ





శ్రీ

# సీతారామవియోగము.

## ప్రథమాంకము

(రంగము—అరణ్యప్రదేశము)

రామలక్ష్మణులు ప్రవేశించుచున్నారు.

రాముఁడు—సోదరా! ఈయరణ్యం బెంత భీకరముగానున్నదో కనుము.

సీ॥ గిరిసంఘములదర భీకరమ్ము గేంద్రములిచ్చు
మిక్కుటంబగు నాదమొక్కచోట
చటులతర జిటజిటాస్ఫుటుల దార్కొని మండు
చుండు దావానలంబొక్కచోట
కొండలనైన డీకొనఁజాలు భయదమ
దొక్కటానీకంబు లొక్కచోట
గరళపావక పరంపరల జెట్లదహించు
భూరి పన్నగసంఘమొక్కచోట

తే॥ గీ॥ లేళ్ల వెనువెంటదవిలి యుర్వీజపంక్తి
లోఁజగుప్పించు బెబ్బులు లొక్కచోట
చెట్టులెక్కుచు దిగుచు విచిత్రరీతి
నోగిఁ జరించెడు ప్లవగంబు లొక్కచోట॥

క్ష్మణు—అన్నయ్యా! మెల్లన నటుపొంచి చూడుఁడు. శుకపికారావంబుల నాలించుచుఁ, దదీయగానామృతాస్వాదనంబొక్కి నిక్కి ఫణంబులెత్తి భుజంగంబు లెట్లాడుచున్నవి!

రాముఁడు__(చూచి) ఆహా! ఇయ్యది కడు చిత్రము, తమ్ముఁడా! ఆపాదఁ బరికింపుము ; నిలువెల్లఁ దెల్లని పూవులు పూచి యుండుటచే నయ్యది యొకమహాత్ముఁడు తపోనిష్ఠాగరిష్ఠుఁడై శ్వేతవస్త్రంబు నొడలినిండ గప్పుకొని యున్నట్లు తోఁచెడిని.

లక్ష్మణు__ఔ, నది యట్లె కనుపించుచున్నది ; ఔరా! భగవత్సృష్టి వైచిత్రి నేమని కొనియాడఁగలము ?

రాముఁడు__తమ్ముఁడా! రానురా నీయడవి యిసుముచల్లినను రాల కుండ దట్టముగా వివిధ లతామహీరుహంబులచే నేవిధంబున నొప్పుచున్నదో చూడుము !

సీ॥ నిజకుసుమాలి సాం•ద్రభ్రాంతి నొదవించి
తనరుపలాశ పా•దపచయంబు
నిడుపైన కొమ్మల • నీడలిచ్చుచు విస్త్రు
తములైన వటమహీ•జములపఙ్క్తి
శరభాదిజంతు సం•చయవాసయోగ్యంబు
లై యొప్పు భీమ గు • హాంతరములు
ఫలభారమున శాఖ • లిల కాని కొన్పించి
పెంపొందు చూతపృ • థ్వీజతతులు

తే॥ గీ॥ ఒకటొకటి సాంద్రతబెనంగి • యొప్పుచున్న
లలిత వికశితపుష్పి తై•లా లవంగ
మాధవీ మాలతీ నవ • మల్లికలను
గలిగి తనరెడి నహహా! మం•జులవనంబు!

లక్ష్మణు__అగ్రజా! ప్రసంగవశంబున మనము ముందేగుదెంచితిమి. మావదినెగారు వెనుకఁజిక్కినది. ఒకింత తాళుదము.

రాముఁడు__ఔ, నామె యబలయగుటచే వెనుకనే చిక్కువడినది. (తిరిగిచూచి) ఆహా! నేనెంతకఠినుండను! నిరంతరంబును గనకమయ శుద్ధాంత సౌధంబులఁ బరిచారికాజనంబులచే సేవలనందు దేవిని నేఁడెంత గాఢప్రయాణంబులచే నలయించితిని! అయ్యో!

ఇప్పుడీ కుసుమాంగింజూచిన నెట్టికఠినహృదయమైన నీరగుగదా! తమ్ముడా!

చ॥ నిటలతటంబునన్ ముసురు • నీలకచావళిఁ జక్కఁజేయుచున్
చటుల మహాతపంబునకుఁ • జంచల మందుచుఁ బాదచారియై
యటవులయందుఁ గష్టము • నందుచుఁ జింతిలి సీతపాటు నే
నెటువలెఁ గన్నులంగని భ • రింతు విషాదభరంబు? సోదరా!

పాపమీయబల కఠినప్రయాణంబులచే బడలి యొడలు వణక బుడమిందూలుచు జలజాకరంబు వెలువడి భానుకిరణంబులం గమలిన పద్మినింబోలి యెట్లువచ్చుచున్నది! ఇంచుకనిలిచి యామెంగలిసికొందము.

సీత—(అలసి నెమ్మదిగాఁ బ్రవేశించుచుండును)

రాముడు—(ఎదురేగి) హాతరుణీ! రాణివాసంబున హంసతూలికా తల్పంబుల సుఖించు నిన్నిట్లడవులందిప్పు మహాకఠినుండను నేనేకదా! అయ్యో! ఇప్పుడు నీ యీ దురవస్థంగాంచిన నా కూరట జనించునే?

సీత—నాథా! విధివశంబునఁ దటస్థంబులగు కష్టంబులకు దుఃఖించుట ప్రాకృతు లగువారికిందగుగాని, మిమ్ముఁబోటివారికిం దగునే? ధైర్యము వహింపుఁడు.

రాముఁడు—మానినీ! ఎట్టివిషయంబులనైన ధైర్యము వహింతుంగాని దురవస్థంగాంచి నేనెట్లు ధైర్యము వహింపఁగలను?

తే॥ గీ॥ అతులిత శ్రాయాసమున నూర్పు • లతిశయిల్ల
విమల వదనాబ్జ బింబంబు • వెల్ల బార
నడుమఁజాలమిఁ దడబడు • నడుగు లిడుచు
నడచు నినుఁగాంచి దుఃఖము • నడఁపఁగలనే?

సీత—మనోహరా! నన్నుగురించి మీరిట్లల వగతురు? భగవత్కటాక్షంబునఁ బదునాలుగేండ్లు నరణ్యవాస దీక్షఁజరిపితిమేని, పిమ్మట మనపురికేగి సుఖంబుల నందమా? కష్టములెల్లకాల మొక్కచోఁ గాపురము సేయునా?

రాముఁడు—మానవతీ! నీవెన్ని చెప్పిననేమి! సర్వదేవతలు సాక్షిగాఁ బరిగ్రహణ మొనరించిన యువతి కానలం దిడుముల గుడుచు చుండ నెవ్వనికైన విషాదము కలుగకుండునా? అయ్యో! రాజోపచారంబు లనుభవించు నీకు నేఁడెంత దుర్దశవచ్చినది?

సీ॥ లలితహాటక సౌధ • ముల నీడలే? నీకు
రమణి! కాంతార వృ • క్షములనీడ;
సరస పదార్థ భో • జనమె? నీ కక్కట!
లలితాంగి • కంద మూలముల తిండి;
అతి కోమలంపు శ • య్యాతలంబు లె? నీకు
కాల్లంటి! పాషాణ • కఠిన భూమి;
శుకశారికముల మం • జుల రుతంబులె? నీకు
కమలాక్షి! హర్యక్ష • గర్జనములు;
తే॥ గీ॥ కనక సోపానయాన సౌ • ఖ్యంబె! నీకు
నయయొ! భీకర పటఘనా • హార్యకటక
చటుల సానుప్రదేశ సం • కటము లకట!
జలజ సమగాత్రి! పూత లం • సచ్చరిత్రి.

సీత—నాథా! జీవితేశ్వరులగు మీరలే యీవిధంబున నడవులఁ దిరుగు చుండ మీయర్ధాంగినగు నేనుమాత్ర మడవులఁ దిరుగవలదా? మీ కష్టసుఖములయందుఁ బాలుగొనుటకు నేఁ దగుదును కదా! యిక చింతయేల?

రాముఁడు—ప్రియసీ! శాత్రవుల వధియింప సమరాంగణంబున ననేక ఖడ్గక్షతంబుల కోర్వజాలిన పురుషుండనగు నే నెట్టి కష్టంబుల ననుభవింపనైన సమర్థుండనగుదునుగాని యిలువెడలి బయట నడుగువెట్టియెలుంగని సుకుమార లతాతన్వివగు నీవెట్లు కష్టంబులను భరింపఁగలవు?

సీత—నాథా! నే నిప్పుడేమి కష్టము లనుభవించుచుంటిని?

రాముఁడు—జీవితేశ్వరీ! క్రూరమృగ శరణ్యంబైన యిమ్మహారణ్యంబున నాతోఁబాటు కందమూలముల భుజింపుచు, మృదుల శయ్యాలం దసృజించి, భూమింబరుండుచుఁ గాలంబుగడపుట కష్టంబుకాదే!

సీత—మీరాకట్లుండిన నుండుఁగాక, ప్రాణేశ్వరులగు మీతోఁ జరియించు నాకేమియుఁ గష్టముగాలేదు.

రాముఁడు—మానినీ! పతిభక్తిఁ జూపఁదలంచి నీవట్లు పలికెదవు గాని నీ యిడుములంగాంచి నే సహింపఁగలనే? హా! తరుణీ నీకిట్టి దురవస్థ రాఁదగినదే?

(తెరలో)

మ॥ చనరే కిన్నరసిద్ధ సాధ్యత్రిదివే • శాదుల్ యథభ్రాంతులై
మనరే పారి వనంబులన్ గిరిశ జం•భద్వేషులేగానిన
న్ననరే వీఁడు జగత్త్రయాంతకుఁడటం • చత్యంతభీతిన్ భువిన్
గనరే కాలకృతాంతు భంగి సురలై •నన్ నన్నువీక్షించినన్.

సీత—(భయము నభినయించి రాముం గౌగలించుకొని) దేవా! రక్షింపుడు. నామేను కంప మొందుచున్నది. ఏదియో గొప్పధ్వని విన వచ్చెటిని.

రాముఁడు—తరుణీ! నీకీభయమేల? వాఁడెవ్వఁడో దనుజుఁడు వచ్చుచుండనోపు. మదీయశరజ్వాలలచే నద్దురాత్ముని సంహరించెద గాక, చింతిలకుము. (లక్ష్మణునితో) సోదరా! అటువీక్షింపుము. నిశాటుండెవఁడో యిటువచ్చుచున్నట్లుండె (ఇంచుకవీక్షించి) ఔరా; ఎవఁడు వీఁడు.

సీ॥ ఘనసమున్నత మహాం•జన శైలమోయన
 సమరు భీకర విగ్ర•హము సెలంగ
భయదకరాళ తీ•వ్రక్రూర ఘనదంష్ట్ర
 దీధితిచయము నం•ద్దెనల గప్ప
కంజాప్తరథ రథాం•గములనఁ దనరారు
 కనుల నుద్యద్వహ్ని•కణము లురల
సింధుగంభీర వీ•చీనాదమున నొప్పు
 నట్టహాసారావ • మవని నిండ

తే॥ గీ॥ చరణఘాతలఁ గుంభినీ•చక్ర మదరఁ
గఠినశూలము బాహుయు•గ్మమున గ్రాల

[illegible]

శరము సంధింపుమా! శరాసనమునందు.

లక్ష్మ—అన్నయ్యా! ఇదే మదీయ శరాసనం బెక్కువెట్టి శిలీముఖ పరంపరల సంధించి దైత్యునిపైఁ బరపెద (ధనువున బాణముల సంధించుచున్నాఁడు)

విరాధుఁడు—(వెనుకటి పద్యముతో, కేకలు వేయుచు శూలముఁబూని ప్రవేశించి) ఓరీ! మానవులారా! ఎవరురా మీరు? నిర్భయముగాఁ ద్రిజగద్భయంకరుండగు విరాధుని ముందు సంచరించుచున్నారు (సీతంజూచి) ఆహా! ఏమి దీని చక్కఁదనము. ఇట్టి సుందరి పరాక్రమవంతుఁడనగు నాకుఁ దగునుగాని దుర్బలులైన యిమ్మానవులకుందగునే? దీని నిప్పుడే కొంపోయెద ఓరీ! బాలులారా! ప్రథమంబున నేను మిమ్ములం జూచి మ్రింగ వలెనని తలంచి వచ్చినను దీనింజూచి మోహించితిం గావున మిమ్ముల వదలితి పొండు

(అని సీతను సమీపింపఁబోవును)

రాముఁడు—(అడ్డము నిల్చి) ఆ! దుర్మతీ! తాళుము

లక్ష్మణు—నిశాటాధమా!

మ॥ మదినొక్కింతయు భీతిలేక త్రిజగన్మాన్యన్ ధరాపుత్రిఁ గో
రెదవా! క్రూరనిశాట! మద్విశిఖభూరిజ్వాలలన్ నిన్వధిం
చెద, దేవద్విజముల్ నుతుల్ సలుప నాజిం గాంచుకొమ్మిక నా
యెదుటన్ నిల్చియు పోఁగలాఁడవెటు బ్రహ్మేంద్రాదులేతెంచినన్.

విరా—ఆ! ఏమి? కడు విచిత్రముగానున్నదే? నేనిదివరకెందరినో మహాశూరులను ఋషులనుబట్టి మ్రింగితినిగాని నాకొక్కఁడైన నెదురుపడి యుండలేదు. నాపరితాపంబును మీరెఱుంగరు కాఁబోలు చెప్పెద వినుండు; ఎవ్వనిపేరు వినినంత సమర, గరుడ, గంధర్వ, విద్యాధరాదు లెల్లరు గుండెలవియ భీతిం దూలుచుందురో! ఎవనికీర్తి దిగంతంబులవరకు వ్యాపించి

యుండునో? ఎవఁడు ధూర్జటినైనఁ గెలువ సమర్థుఁడో అట్టి శూరుండగు విరాధుసిగా నన్నెఱుంగుఁడు. మరియు,

మ॥ నలతుఁ సర్వచరాచరాంబుజ భవాండంబెల్ల బాహుద్వయిఁ
గెలతుఁ సంగరరంగమందు భుజశ • క్తిఁ నిర్జరవ్రాతముఁ
నిలతుఁ ధూర్జటినైనఁగెల్చి యనిలో • నిర్వక్రదర్పోద్ధతిఁ
వలతుఁ క్రూరనఖాగ్రధార నల జం • భద్వేషిచర్మంబులఁ

ఇట్టి మహాబలుండనగు నన్ను మీరేమిచేతురు లెండు. (సీతతో) సుందరీ! ఈ దుర్బలులగు బాలురతో నడవులందిరుగుచు కష్టములను భవింపనేటికి? నావెంటరమ్ము. నీవుకోరినట్లాచరించుచుందును. నీయాజ్ఞానువర్తినై యుండెద. ఇటురమ్ము. (అనిసీతనెత్తుకొనిపోవుచున్నాఁడు).
రాముఁడు—(కోపముతో) ఓరీ దురాత్మా! ఏమి రా నీనుదను! ఇదే మదీయ బాణానలమున నీప్రాణముల హరించెద

తే॥ గీ॥ అర్కవంశాబ్ధిసోముఁడఁ • నైతినేని
పంక్తిరథునకు సుతుఁడనై • పరగితేని
ఘనశరానల కీలల • నిను వధింతు
నబ్జజామరనాథాదు • లడ్డమైన.

ఓరీ నిశాచరాధమా! ఇదిగో చూడుము. నీపై నమోఘంబు లగు బాణముల విడిచెద.

ఉ॥ నీరమునందు డాగినను • నిర్జరనాథునిఁ దోడుతెచ్చినఁ
చోరుఁడవై చరించినను • శూలధరుఁ శరణంబు వేడినఁ
సారసజాతులోకమున • జయ్యన దాగిన వహ్నిఁ జొచ్చినఁ
ధీరత నీదు మస్తకముఁ • ద్రెంచెడి నీశరముల్ నిశాచరా!

(బాణవర్షముఁ గురిపించుచున్నాఁడు.) (యవనిక జారుట.)

---

(రంగము అరణ్యప్రదేశము)

(సీతారామ లక్ష్మణులు ప్రవేశము)

రాముఁడు—తమ్ముఁడా! మన మివ్వనసంచారము చేయుచుండుటచే తనేకదా మహామునుల ననేకుల దర్శించితిమి.

లక్ష్మణుఁడు—ఔను. మనతల్లి మనల నరణ్యంబునకుఁ బంపుటకూడ మేలైనది. లేకున్న నీఋషుల నెట్లు చూతుము?

రాముఁడు—సోదరా! పట్టణముల నివసించుటకంటె వనవాసమే మంచిదిసుమా! కావుననే ముని లరణ్యంబులఁ బర్ణగృహముల నిర్మించుకొని యుందురు

లక్ష్మ—అగ్రజా! మనము దర్శించినవారిలో నగస్త్యమహర్షిప్రభావము మిగులఁ గొనియాడఁ దగినది. వనవాసదీక్షం జేసియేకదా అమ్మహామునిచే సత్కారము లందితిమి.

రాము—సందేహమేమి? అహా! మన భాగ్య మేమనవచ్చు?

మ॥ జలధిం జేరి తదీయనీరముల విశ్వం బెల్ల కంపింప ను
జ్వలతేజంబున ద్రావె, నభ్రమున కోజన్ దాకి మార్తాండమం
డలముం మార్కొని నట్టి వింధ్యశిఖరిం పాదంబునం ద్రొక్కె ని
ల్వలవాతాపుల ద్రుంచె నట్టి ఘనుఁ జూడం గంటి మీకానలోన్

లక్ష్మ—(తిరిగిచూచి) అన్నయ్యా! అటు వీక్షింపుఁడు. ఏదియో యొక ఖగము ఘోరరూపియై యిటు వచ్చుచున్నది. మన కేదేని హాని చేకూర్పదు గదా!

రాము—రానిమ్ము. ప్రథమంబున దాని వృత్తాంతమరసి మన కయ్యది విరోధియై నిరోధించిన వధింతము.

జటాయువు—(యథోచితముగాఁ బ్రవేశించి) మహానుభావులారా! నేను మీతండ్రియగు దశరథ నరేంద్రునకు హితుండను, నన్ను జటాయు వందురు. నేటికి మదీయ పురాకృతపుణ్యవశంబున మిమ్ముల గాంచితిని. నా జన్మము ధన్యమయ్యె.

రాము—ఖగపుంగవా! ప్రథమంబున నిన్నుం గాంచి మేమెవ్వరోయని కొంటిమి మాకిప్పుడత్యంత సఖుండవైతివి నీ వెద్దేని కార్యసాఫల్యంబుఁ గోరితివేని మాశక్తికొలఁదిఁ దత్కార్యంబునకు సహాయ మొనరించెదము.

సీ॥ ఘోరసంసార పాథోరాశి కెవ్వాని
శ్రీపదాబ్జద్వంద్వ సేవ నావ

కైవల్యసౌఖ్య సంఘటనంబు కేవ్వాని
పూజావిధానంబు భూరివారి
అజ్ఞానభీకరోద్యత్తాన కేవ్వాని
సారకీర్తనము కుఠారధార

తే॥ గీ॥ కమలభవదత్త వరబల గర్వితోగ్ర
దనుజకులమున కెవని దర్శనము ఘనము
అట్టి నినుఁగాంచి ధన్యుఁడ నైతి నేఁడు
భక్తరక్షణశీల! కృపాలవాల!॥

మహామహులగు మీదర్శన మబ్బెఁగావున, దేవరకరుణదక్క నాకింకేమికావలయు? మీ రెచ్చటకైన నేగవలయునన్న మోచికొనిపోయెద.

రాముఁడు___అండజాగ్రణి! వలదువలదు. పితృవాక్పరిపాలనార్థమై పదునాలుగబ్దములు మేమరణ్యవాసదీక్షం జరుపవలయుఁ గావునఁ దత్కార్యార్థమై పంచవటంబునఁ బర్ణశాల నిర్మించుకొని యందు నివసింపనెంచినారము మహాత్మా.

జటాయువు___అయ్యలారా! పోయిరండి మీకుశుభంబగుఁగాక! నేఁ బనివినియెద (అని నిష్క్రమించును).

రాము___నేఁడు బంధుదర్శనముఁ జేసికొంటచే, మనమెంతయుఁ గృతార్థులమైతిమి. మన మా యగస్త్యమహర్షి చెప్పినచొప్పునఁ బంచవటంబుఁ జేరి యందుఁ బర్ణశాల నిర్మించుకొని, వనవాసదీక్ష గడపెదము. నడుపుము. ప్రేయసీ! రమ్మా.

సీత___నాథా! వచ్చుచున్నాను.

(ముువ్వురు నడుచుచున్నారు)

(అందరు పంచవటముం జేరుదురు)

రామ___తమ్ముఁడా! ఇయ్యదే పంచవటంబుసుమీ! ఆహా! ఏమి యీావన రామణీయము! మనము పర్ణగృహము నిర్మించుకొని వశించుట కీవనంబెంతయు, రమ్యముగానున్నది. దీనిం గనులారఁ దిలకింపుము.

సీ॥ ఎలమావిగున్నల • నెక్కి లేతచిగుళ్లు
గడుమెక్కి సొక్కు పికముల సొబగు
గుములౌచుకూడి పిం ఛములవిప్పి
నర్తించు కేకి బృందముల నీటు
కమలమరంద పానముఁ గ్రోలి సోలి ఝం
కారముల్ సేయు భృంగముల సొగసు
బింబముల్ మెక్కి పొంకంబునం గామశా
స్త్రములఁ బఠించు కీరముల తీరు

తే॥ గీ॥ విరహిజనమానసంబులు • భేదిలంగ
నరచుచుఁ జరించు శారికాఘోరవంబు
నహహా! మదికెంత సంతస • మబ్బఁజేసె!
నిచట వసియింపఁదగు మన • కెలమి నెపుడు.

సోదరా! ఈ ప్రాంతమున నొక్కచోఁ జక్కగ మనముండు టకుం దగిన పర్ణశాల నొకటి నిర్మింపుము.

లక్ష్మ—దేవరయానతి శిరసావహించి తత్కార్య ప్రయత్నం బొన రించెదగాక.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

(యవనిక జారును.)

(అరణ్యమునందు పర్ణశాల)

(రాముఁడు, సీత, యథోచితముగాఁ బ్రవేశించుచున్నారు.)

సీత—మనోహరా! పురనివాసమున కన్న వననివాసమే మహానంద కరముగా నున్నది. ఇక మనదీక్ష యెన్ని దివసంబులకు పూర్తి యగును?

రామ—ప్రేయసీ! ఇంకొక వత్సరంబైనఁ బదునాలు గబ్దంబులగును. పిమ్మట మన నగరంబున కేగవచ్చును. నీకీ యరణ్యవాసంబునఁ గలుగు చింతలకు నేనేకదా కారణుండను.

సీత—నాథా! అట్లు పలికెదరేల? రాజన్యకోటు లెల్లరుఁ గొలువ మహా చక్రింబుఁ బాలింపఁదగు మీరీరీతి వానులై యుంటిరను చింత

దక్క నాకేవిషయంబునను జింతలేదు. కొలఁది దినంబులలో నదియుఁ దీరఁగలదు. పాపము, సుకుమారుండగు లక్ష్మణుండు గూడ వనతోఁబాటు గహనంబుల నివసించుటకెంతయుఁ జింతిలెద. అతండిట భార్యనుగూడ త్యజించియుంటచే, నెట్లువిషాద మందుచున్నవాఁడో తెలియరాదు.

రాముఁడు—మనోహరీ ! విధివశంబు నెవ్వరు తప్పించుకొనువారు.

(అప్పుడు శూర్పనఖ ప్రవేశించును)

శూర్ప— (తనలో రాముంజూచి) ఆహా ఈ సుందరాంగుఁ డెవఁడు? ఏమి వీని సోయగము !

సీ॥ సరసీజముల సొంపు • మరపుదేజాలుచు
నిడుదయై పొలుపారు • నేత్రయుగము
ఇంద్రనీలపు మణు• లేని సాటికిరాని
నీలవర్ణపు కాంతి • గాత్రలు మేను
జాను యుగ్మంబున • కాని దీర్ఘంబులై
యొప్పుచు తనరు బా•హుద్వయంబు
అంభోజ మకరంద • మాని గుమ్మరు తేంట్ల
కులముల మీరు మేల్ • కుంతలములు

తే॥ గీ॥ గలిగి మన్మథమన్మథా • కారుఁ డనఁగ
నిందుఁడో చందురుండో మ• హేంద్రుఁడో యన
దనరు ; నీతనియందంబు • గనులఁ గనినఁ
బురుషులకు నేని మోహంబు • బుట్టకున్నే !

అరరే ! ఇంతటి సుందరాకారుఁ డెవఁడైయుండ నోపు ! నాకీతనింజూచి నదిమొదలు పోయి పైఁబడుదునా యనునంతటి మోహముద్భవించినది ఇతఁడెవరోయరసెదఁగాక (రామునిఁజేరి) సుందరాంగా! భవదాకృతింగాంచి నేనెంతయు మంతనంబున సంతస మందితి నీరూపంబుఁజూడ నొక రాకొమరుండట్లు తోచుచున్నది. అట్టి నీ వీవిధంబున నడవులఁజరింపనేల? నీయాభిధానమేమి ?

రాము—పడఁతీ! మేము నీవన్నట్లు రాజవంశసంభూతులమైనను, కాల వశంబున నిట్టివేసంబులఁ దాల్పవలసె. నీరాక యెందులకు?

మ॥ వగువా! యెవ్వతే వీవు? నీవరుని నామంబేమి? యీరీతి నొం టిగఁ గానం జరియించెదేటికి? ప • డంతీ యెచ్చటన్ నీకుబం దుగు లెవ్వారును లేరొ నీమగఁడు నిన్నుం బ్రేమఁజూడండొ నీ దగు వృత్తాంతము నెల్ల దాపక నెలంతా! నిక్కముం దెల్పవే!

లక్ష్మ—(ప్రవేశించి తనలో) మాయన్నగా రెవరి తోడనో సంభాషిం చుచున్నట్లున్నారు, ఈ మానవతి యెవరో తెలియదు.

శూర్ప—ప్రియా! నాయుదంతంబు వినఁదలఁచితి వా! దానికేమి, చెప్పెద గాని, ఈమానిని నీ కేమగు? ఆబాలుం డెవఁడు!

రాము—వారును నాకగువారలె. నీ నిజస్థితి నెఱుఁగఁజెప్పుము.

శూర్ప—సఖా! నన్నుం దెలియ నీవింత తొందరఁజెందుచుండ, నేను వచియింపకుండుట పాడిగాదు. వినుము. నేనొక రాజవంశ సంజాతను. మనకిరువురకు భేదముండఁజెల్లదు. భవదభిధానం బును నీ యిరువురి బంధుత్వంబును, మీ యునికియు నెఱిఁగించి నన్నానందపరుపుము.

రాము—(తనలో) ఇది యెవ్వతెయోకాని, నన్ను "ప్రియా" యనియు, "సఖా" యనియుఁ బిలుచుచున్నది. నన్నెఱింగించినకాని, తన్నె ఱింగింపనట్లున్నది. దీనివాక్యములచే రాజవంశసంజాతయని తెలిసినది. కాని నమ్మరాకున్నది. (ప్రకాశముగా) అతివా!

మ॥ ధరణిన్ మేమువసించుచుండెద మయోధ్యాపట్టణంబందు నీ పసుండయ్యెడు నాకుసోదరుఁడు; యీచంద్రాస్యమత్పత్ని; యో గరితా! సజ్జనకాంక్షచేతఁ బదునాల్గబ్దంబులున్ కానలం దిరుగన్ వచ్చితి మేము ముగ్వురము నింతీ! మౌనివేషంబులన్॥

నన్ను రాముఁడందురు. మ దనుజుండు లక్ష్మణుండు. ఈ సుంద రాంగి సీత. మా సవతితల్లియగు కైకమ్మ పదునాలు గేండ్లడవులకు

మమ్ముఁ బంపునట్లును, దన సుతుఁడగు భరతునకు రాజ్యమిచ్చునట్లును, పతిచే వరములందె. తత్కారణంబుగ మేమును తండ్రియాజ్ఞం దలం దాల్చి, తల్లికోర్కె దీర్ప నిట్లువచ్చితిమి మావృత్తాంత మిది.

శూర్ప— ఇఁక నాసంగతిఁ జెప్పెద వినుము. నేను లంకానగరాధీశుం డగు రావణునకు ముద్దుచెలియల నగుదు. కమలభవునిచే ననేక వరంబుఁ బడసి నిఖిలలోకంబుల గడగడలాడించుమహాపరాక్రమ శాలియగు నాయన్న ప్రఖ్యాతి నేఁ జెప్పనక్కరలేదు. నీవెఱిం గియే యుందువు. నాకింకను బంధువర్గముగలదు రాజగు దశ కంఠుండు సోదరినగు నన్నెంతయు నక్కరచేఁ గారవించుచుండు. కావున వారెల్లరు నాయాన మీరఁజాలరు. నాతోడ నొకింత విరోధంబుగలవారెల్ల నన్నుఁ గాంచినప్పుడెల్ల రాజుగారితో నేమని చాడీలుచెప్పుదునోయని భయమందుచుందురు వేయేల నా కెవనియందైనఁ గోపముండిన నాతం డెవ్వఁడైనను సాధించి బాధింతు. ప్రేమగలిగిన నాతనికిం గంటికి ఱెప్పపగిది గాచి కొనియుండి, చతుస్సముద్రవలయితధరామండలంబెల్ల వానికిం గట్టిపెట్టుదు. నేఁడు నాభాగ్యమువలననో నీ యదృష్టము మంచిద గుటచేతనో, నిన్నిచట వీక్షించి మోహించితి. సందేహింపక భవదీయ పరిరంభణ సౌఖ్యంబు నలవడఁజేసి తగువిధంబున నన్ను గారవించి నావెంట లంకాపురికి రమ్ము. నీకెల్లవిధంబుల మేలు జేసి నిన్ను రారాజు నొనర్చెద. శంకింపకుము.

రాముడు— (తనలో) ఓహో! దీని దుష్ప్రవర్తనయంతయు నిప్పుడు తేటపడినది. నన్నుఁ గాంచి మోహించినదఁట. ఇప్పు డీ యువతి రాక్షసాంగనయైనను వధించుట న్యాయవిరుద్ధము. సమయోచి తవాక్యంబులచేఁ బంపివేయుదు. (ప్రకాశముగా) పడఁతీ! నేనిది వరకొక కాంతను బరిగ్రహించి యున్నాఁడను. నీకుం గామంబు గలదేని యొకమాట చెప్పెద. నా తమ్ముఁడు ప్రస్తుత మంగనా రహితుండు.

మ॥ అతివా! సోదరుఁడా మహాసరసుఁ డీ • వానూత్నతారుణ్య
జితపుష్పా జవ్వని వందు దేనతఁడు నిన్ • జేపట్టనా నీ వనా

రత మానేర్పరిఁగూడి పుష్పశరసం•గ్రామంబునన్ సంతస
స్థితిఁ గాలంబును బుచ్చునా వెపుడు బ్రీ•తిన్ నీలభృంగాలకా !

శూర్ప—సుందరాంగా ! నీపై గంపెడాసబెట్టుకొని వచ్చిన తరుణి నీచందంబునఁ జిన్నబుచ్చి పంపుట నవయౌవనాకారుండవగు నీకుం దగునే ? అదే ! మదనుం డిదే యదనని నాపైఁబదనైన పూవుటంమ్ముల గురిపింపసాగె. నీవాతనిమదమడంపఁజాలుదువని వేడితి. మరుగు జొచ్చినవారి రక్షించుట కర్తవ్యంబగు గాని శిక్షించుట తగదని నీవు నెఱుంగుదువు. జాగేల ? నను నీ కవుంగిట గారవింపుము.

రాము—వెలఁదీ ! నీకిప్పు డీశత్రునివలన భయముకలిగెనో వానిందరుమ మదీయసోదరుండే సమర్థుఁడు. అట్లాతఁ డొనర్పనిచోఁ బిమ్మట తగు నుపాయమాలోచింపవచ్చు.

శూర్ప—(స్వగతము) ఈమాటలవలన నితనికిని నాపైఁ బ్రేమకలదని తోచుచున్నది. తనతమ్మునిచిత్తం బరయనెంచి యిట్లు చెప్పియుండవచ్చు. నేనాతనికడకుఁ గూడఁ బోయివచ్చెద. (కొంచెమునడచి, లక్ష్మణుం జేరి) ఆహా! ఈతండెంతయందగాఁడు. ఒకరికన్నొకరు చక్కదనంబున నెక్కువయైయున్నారు. వీనింబొందనిచో నాజన్మ మేల ? (ప్రకాశముగా) మనోహరా ! నాయుదంతంబు వినియుందువు. మన్మథ ధనుర్ముక్త భీకరశరపరంపరావిచ్ఛిన్న దేహలతనైయున్న నన్నొక్కింత నీ బాహువల్లరుల గట్టిగ గౌగలించి రక్షింపుము. నీపైఁగలమోహానలంబున స్రుక్కితి. నీచేతం జిక్కితి. నీకుం దక్కితి.

లక్ష్మ—(స్వగతము) మాయన్నగారు మాటలచే దీని నిచ్చటకుంబంపనియ్యది నాకడకువచ్చె. నేనిప్పుడొక్కయుక్తిజేయవల్లయు (ప్రకాశముగాఁ మానినీమణీ!

ఉ॥ సేవన వీరిసన్నిధిని • నిత్యము సేవలు జేయువాఁడ నో
మానిని ! నీవటన్న సుకు•మారివి నన్వరియింతువేని నా

తే॥ వనిశంబు వారల మాదుల్ ముదమందెడుభంగి సేవలన్
మానక సేయఁజాల వని • మానసమందున శంక నందెదన్॥

పాపము, నీవు బొత్తుగ నమాయకురాలవు. నేను తన సేవకుండ
ననుమాట నీతో నతండు చెప్పలేదు కాఁబోలు.

శూర్ప—ఏమీ! నీవాతని సేవకుఁడవా ? ఎట్లు ! సోదరుఁడవు కావా ?

లక్ష్మ—ఓహో! తెలిసినది. నీతో నేను తన తమ్ముఁడనని చెప్పి నిన్ను
మోసపుచ్చె.

శూర్ప—(స్వగతము) ఔరా! ఎంత మోసమైనది. (రాముంజేరి) మనో
హరా ! నన్నిట్లు మాయఁజేయఁదగునా ? ఇదియేటి సరసము?
అతఁడు నీతమ్ముఁడా; ఎంతటి టక్కరిమాట లాడితివి? పోనిమ్ము.
నే నందుల కలుగను. జాగుసేయక నా యభీష్టము దీర్పుము.
నీపాలఁబడితి.

రాము—తరుణీ! నీమాటలు నాకర్థమగుట లేదు.

శూర్ప—అర్థమేల కాదు ? ఇఁక నీ ప్రసంగము నిలిపి రక్షింపుము.

రాము—మానినీ ! నీకు నే నెన్నిమారులు చెప్పవలయు ?

చ॥ కల దొకకాంత నాకు పయిం గా నినుఁగూడ గ్రహింతునేని నీ
కలవడనేర దెంతయు సుఖంబు ముదంబిది యెట్టులంటివా
పులగములోన నూపమును • బొందుగఁ జేరిచినట్లు, కాన నేఁ
బలికినరీతి లక్ష్మణు న • వాంబుజలోచను గూడుమా చెలీ !

శూర్ప—సుందరాంగా ! రాజవంశసంభూతనగు నన్నొక సేవకునితో
రమింపఁబొమ్మని చెప్పుటకు సాటివాఁడవగు నీకెట్లు నోరాడె ?
ఇయ్యది యెందైన ధర్మమా ?

రాముఁడు—సేవకుండెవరు? లక్ష్మణుండు సేవకుఁడనుకొంటివా యేమి?
(ఆలోచించి) తెలిసినది. సోదరుండు పరిహాసమునకై నీతో నట్లు
వచియుంప నయ్యది నమ్మితివి కాఁబోలు. ఎంతటి వెట్టివానవు !

శూర్ప—మనోరమణా ! నీకు సందేహమేల ? నీసోదరునకు నాపై ప్రేమ
లేనట్లు తోచుచున్నది. నీవే మదీయమానసంబున రగిలెడు మద
నాగ్ని నార్ప దక్షుండవు.

రాముఁడు—వనితా ! నీవు బొత్తిగ తెలివిమాలిన దానవు. అంగనారహితుఁడై యున్న నవయౌవనాకారుఁగూడిన సౌఖ్యమో లేక భార్యగల నాబోఁటివానిం గూడిన సౌఖ్యమో నీవు యోచించుకొమ్ము.

చం॥ లలన నొకర్తుకన్ మును కరగ్రహణం బొనరించియున్న నన్నెలమిని నీవు నేఁడు వరియించిన సౌఖ్యము సున్నగాక నా కలికికి వైరివాదు వది. గావునఁ గ్రమ్మరఁ బోయి లక్ష్మణున్ గలసి మనోజకేళిఁ గలకాలముఁ దేలుచు సౌఖ్య మందుమా.

(లక్ష్మణునిఁజూచుచు) ఆహా! ఏమి నీ యదృష్టము! నీ ప్రియుండు నీకై యెట్లుపరితపించుచున్నాఁడో చూడుము. జాగేల ? సత్వరంబున నాతనితోఁగలసి నీయభీష్టము దీర్చుకొమ్మ పొమ్ము. ఇదేసమయము.

శూర్ప—నాప్రియుండు నాకై పరితపించుచుండెనా ? నాభాగ్యము నేమనికొనియాడవచ్చు ? (సత్వరంబున లక్ష్మణుం జేరబోవుచుండ)

సీత—ఆహా ఏమిచిత్రము! నాథుండెంత చమత్కారము చేసె. (అనినవ్వుచున్నది)

శూర్ప—(వెనుకకుదిరిగిచూచి కోపముతో) ఓసీ పాపీ ! నన్నుఁజూచిన నీకు నవ్వువచ్చెగా ? నీవుండుటంబట్టియే నన్నీతఁడు ప్రేమింపఁడయ్యె. తాళుము. నీమద మడగించెద, ఇదిగో నిన్నిప్పుడే వడియముగాగున నమలి మ్రింగెద. (సీతపై దుముకును.)

రాము—ఆఁ నిలువుము నిలువుము (సీతను శూర్పనఖను చెరియొకచేత బట్టుకొని లక్ష్మణునితో) తమ్ముఁడా ! చూచితివా దీని సాహసము ఇఁక దీనితో నధికప్రసంగము కూడదు. పాప మిది చాలా సేపటినుండియు నీకై వేచియున్నది. జాగుసేయక తగిన బహుమాన మిచ్చి పంపివేయుము.

లక్ష్మ—మీయాన శిరసావహింతు. పడఁతీ! రమ్మమ్మ. నీపై నన్నగారికిఁ గృప జనించుటచేఁ దగురీతి గారవించి పంపెద రమ్ము,

రాము—చెలీచనుము (విడచును)

శూర్ప—(సంతోషమున) మనోరమణా! నీకునాపై నిప్పుడు కరుణజనించెనా? ఇదిగో వచ్చితి, నాయభీష్టము దీర్చి పున్నెము గట్టికొమ్ము. (లక్ష్మణునిఁజేరి) జాగేల?

లక్ష్మ—జాగేమియు లేదు. సమీపమునకురమ్ము (అని ముందుకులాగి నాసికంబట్టుకొనుచున్నాఁడు)

శూర్ప—(స్వగతము) ఏమిది! ఈతఁడు సురతవిలాసము తెలియనివానివలె నున్నాఁడు. కనకకుంభములబోలు కుచగిరులఁ బట్టుకొనక మెరుఁగు లీనుచెక్కుటద్దముల వదలి, దేహాలత స్పృశింపక ఎక్కడనో నాసికపట్టుకొన్నాఁడు. ఇది యేటిసరసము? ఒకవేళ నిది దేశాచారమైయుండవచ్చు. నే నేఁసంశయింపవలయు? (ప్రకాశముగ) తడవేల?

లక్ష్మ—తొందరఁజెందకుము.

తే॥ గీ॥ ఒడలు మత్తెక్కి శూరులఁ • ముగ్రిబలుల
మేము కనుచుండ మది భయ • మింతలేక
దుర్మదంబున సీతావ • ధూలలామఁ
బట్టి మ్రింగఁగఁ బోదువా • పాపురాల!

(అని ఖడ్గంబున ముక్కును జెవులును గోసి దోశిలిలోఁబెట్టి) పొమ్ము. ఇప్పుడు నీకుందగిన బహుమానమిచ్చితి.

శూర్ప—(పెద్దపెట్టున నేడ్చుచు) ఓరీ! దుష్టుఁడా! నన్నిట్లు పరిభవింతువా? మీయన్నకుఁ జెప్పెదఁజూడుము (అని రాముంజేరి) ఓయీ! చూడుము. నీతమ్ముఁడెట్లొనరించినాఁడో. వానింజంపి నా పరాభవాగ్ని నార్పుము. (ఏడ్చును).

రాము—ఓసీ! తమ్ముఁడు కడుచక్కనిపనిఁజేసినాడు. లేకున్న నొక్కయాఁడుదానవగు నీకింత మదమా?

చ॥ మనమున శంకలేక సుకు • మారశరీర నిలాతనూజ జ
య్యనఁ గబళింపఁబోయిన మ • హాదురితాత్మవు కాన నీకు ము
క్కును జెవుఁ లుగ్రఖడ్గమునఁ • గోయుటయేఁ తగుశిక్ష; చాలు నే
డ్చినఫలమేమి నీపురికిఁ • జేరి మెలంగుము సత్ప్రవర్తన॥

శూర్ప—ఓరీ క్రూరచిత్తులారా! మీరు నన్నీ తీరునఁ బరిభవింతురా? మా యన్నలకుం జెప్పి మీ ప్రాణముల దీయింపకున్న నే దనుజ యువతింగాను చూడుఁడు. (అని యేడ్చుచు నిష్క్రమించును.)

సీత—మనోరమణా! మని కీదనుజాంగనవలన నేమియుఁ జెడుగులు సంభవింపవుగదా?

రాము—అట్లెన్నటికిఁ దలంపకుము (లక్ష్మణునితో) సోదరా! నీవు కడు మంచిపనిఁ జేసితివి. ఏమన మనచేఁ బరాభవింపఁబడినదానవి తప్పక తన బంధువర్గంబును మనపైకిం బంపు అంత మనకును వారికిని నమోఘంబగు యుద్ధంబు జరుగు; నిందుచే నెన్నిపనులు సమ కూరుచున్నవో చూడుము.

సీ॥ ఘనభీకరోగ్రసంగర విహారంబున
గాలంబు రయమున గడపు టొకటి
లోకకంటకుల క్రూరుల నిశాటులబట్టి
సమ గాంగణంబునఁ జంపు టొకటి
దనుజసంఘంబు చచ్చిన వార్తవిన్నంత
దేవతులెల్ల మోదించు టొకటి
భయదరాక్షస కదంబముఁ ద్రుంచితి వటంచు
గడు గీర్తి నెల్లెడ గాంచు టొకటి

తే॥ జీ॥ గరుడ గంధర్వ యక్ష కిన్నర భుజంగ
వరులకెల్ల నిశాటులవలనఁ గలుగు
భయము మానిపి వారిఁ గాపాడు టొకటి
మునిజనంబుల కతిసౌఖ్యమొసవు టొకటి.

(తెరలో గొప్ప కలకలము)

సీత—(వడకుచు రాముం గౌగలించుకొని) నాథా! ఎచ్చటి దా మహారవము? నా హృదయంబున గడు భీతిగా నున్నది.

రాము—ప్రాణేశ్వరీ! జంకకుము (వెన్నుచరచి, లక్ష్మణునితో) తమ్ముఁడా! దానవులు మనపైకి వచ్చుచున్నట్లు తోచెడిని. నేఁ

పోయి యద్దురాత్ముల మదమడంచి వత్తు. నీవు పర్ణశాలయం దతిజాగ్రతతో సీతం గాపాడుచుండుము.

లక్ష్మ—అన్నయ్యా! నే నద్దనుజాధములతో సంగరమొనరించి జయంబు గైకొనివత్తుగదా!

రాముఁడు—లక్ష్మణా! అట్లుకాదు. నేనే పోయివచ్చెద. కడుమెలఁకువగలిగియుండుము. (సీతతో) ప్రాణేశ్వరీ! నీ కేదురాత్ములవలన నిపుడు భయముకలిగెనో, వారల గడతేర్చివత్తు. లక్ష్మణుండు పర్ణశాలకడ నుండు. భయఁపడకుండుము తమ్ముఁడా! పోయివత్తు. (ధనుర్బాణములఁ బూని నిష్క్రమించును)

(యవనిక జారును)

శ్రీమద్భగవతీ కటాక్ష సంపాదిత కించిత్కవితా
జ్ఞాన సమేత, వల్లాది గోపాలకృష్ణ ప్రణీ
తంబైన సీతారామ వియోగ
మునఁ బ్రథమాంకము.

బ్రహ్మార్పణము.





శ్రీ

# సీతారామవియోగము.

## ద్వితీయాంకము.

(ఖరుఁడు దూషణుఁడు మొదలగు వారితో యుద్ధముఁ జేయుచు రాముఁడు ప్రవేశించుచున్నాఁడు)

ఖరుఁడు—అరే చూచెద రేమి ? ఈ దుర్మార్గునిఁ బొడువుఁడు. వీనిమాంసమెల్లఁ బక్షింపుఁడు.

దూషణుఁడు—ఇదిగో, నేనిప్పుడే యీమనుష్యాధముంబట్టి కరకర నమలి మ్రింగివైచెద (అని రాముని సమీపింపఁబోవును)

త్రిశిరుఁడు—ఓరీ, ఉండుము ముందుము నా కాకలి యగుచున్నది. వీని పలలంబుఁ దిని రుధిరంబుఁ ద్రావి, క్షుత్పిపాసఁ దీర్చికొందు.

రాముఁడు—దుర్మదాంధులారా ! ఎంత విన్నను మీప్రగల్భంబులకు మేరలేకున్నది ననుఁ భక్షించెదరా ! మీకాకలి యంత మిక్కుటముగ నున్నచోఁ జాలునవువరకు మదీయ శరాహారంబు నొసంగెద, భక్షింపుఁడు.

ఖరుఁడు—ఆఁ ఏమిరా ! దుర్మతీ ! నీవా మాకు శరాహార మొసంగువాఁడవు ? త్రిభువనైకవీరుండైన ఖరాసురుని పరాక్రమ మెఱుఁగవా యేమి ?

చ॥ జలజభవాండ ముగ్రగతిఁ • జయ్యన బాహులఁబట్టి మ్రింగ నా
జలధుల నింకఁజేయ నుడు•సంచయముల్ వెస భూమి రాల్పఁగాఁ

కులధరణీధరేంద్రముల • గోరున మీటఁగఁ జాలినట్టి యీ
యలఘుప్రతాపునిం దెలియ • వా ? ఘనునిన్ ఖరదానవాగ్రణీ

రాము—దైత్యాధమా ! ఏటి కీడంబపు లాడెదవు ! చేతనైనఁ బోరు సల్పుము. లేదేని పలాయితుండవుకమ్ము.

ఖరుఁడు—(కోపముతో) మర్త్యాధమా ! ఏమనిగా ప్రేలితివి ? ఇదిగో నిన్నిగద కెరగావింతుఁ జూడుము. (అని రామునిపై కురుకును)

త్రిశిరుఁడు—(ఖరునిఁబట్టికొని) తాళుము. నాకు పిపాసచే గొంతెండి పోవుచున్నది. ఇప్పుడే వీని నీగదచేఁ జితుకగొట్టకుము. నాకీతని నెత్తురు ద్రావినగాని దప్పియారదు. (అని రాముంజూచి) ఓరీ ఇఁక నీ విల్లును దీసి యొకచోఁ బెట్టుకొమ్ము. మాదేహములకల్ప ములగు నీశరము లేమిహానిఁ జేయఁగలవు. అందు నేనసాధ్యుండ ను. దానవు లందెల్ల మేటిని.

మ॥ ఒరుగంజేయుదు ధారుణీతలముపై • నుత్తుంగశైలంబులన్
కరుగంజేయుదు నాహవంబున విప • క్షానీకచిత్తంబులన్
విరుగంద్రొక్కుదు కుంభినీతలము వే • విశ్వంబు కంపింప న
న్నెఱుఁగంజేతుఁ ద్రిమస్తకాఖ్యదనుజుం • డీతండటంచె ల్లెడన్

మదీయదంష్ట్రాగ్రంబులచే నీ కుత్తుకఁ గొరికి నెత్తురు ద్రావి తృప్తిఁజెందెద (అని రామునిఁ బట్టుకొనఁబోవును)

దూషణు—(త్రిశిరుం బట్టుకొని) తమ్ముఁడా ! ఉండుము. నాకెన్ని దినములనుండియో నరమాంసము లభింపనందున గుతియెత్తి నటులున్నది. వీనిని నాకువదలివేయుము. (రామునితో) బాలకా! ఇంకెందేగెదవు ! పులివాతం బడిన లేడిపిల్లవలె నేఁడు నీవు నాచేఁ జిక్కితివి. ఎంతబలాఢ్యునికైనను నన్ను గెల్చుటకష్టము, సిద్ధముగనుండుము. ఇదిగో వచ్చుచున్నాను. (రామునిఁ బట్టుకొనఁబోవును)

త్రిశిరు—(దూషణుం బట్టుకొని) ఓరీ ! నీకింత యాసకూడదు. నేనప్పటినుండియు నీతనినెత్తురు ద్రావ నెంతో వేడుక పడియుంటిని.

నాయాశ నిరాశఁజేయకుము. కావలయునన్న నేను నెత్తురు ద్రా
వినపిమ్మట నీవు మాంసము భక్షింపుము.

దూషణు—సరే ! అట్లే కానిమ్ము. ఇరువురము నాతనిపైఁ బడుదము రమ్ము. (రామునిపైకి దుముకుచున్నారు.)

రాముఁడు—దనుజాధములారా మీగర్వములణఁప నిదే మహాశరం బుల విడుచుచున్నాఁడ. శూరులేని వీనిం దప్పించుకొండు. (అని కొన్ని శరములు రాక్షసులపై రువ్వును.)

దూషణు—ఔరా ! మదాంధా ! ఎంతపనిఁ జేసితివి. తాళుము దూషణుని పరాక్రమ మీవెఱుంగవు కాఁబోలు.

తే॥ గీ॥ ధర నొరుగఁజేతు హరుని వి॰ దారణమున
బాకశాసను నాజిలో ॰ బరిభవింతు
సురలఁజెండుదు సంగర॰క్షోణియందు
దూషణుఁడ నన్నెఱుంగవా ॰ దుర్మదాంధ!

అరే దైత్యులారా ! ఇమ్మానవుం బట్టి చీల్చిచంపి వీని పలలం బుఁ జవులూర భక్షింపుఁడు.

(అందరు గలసి యుద్ధము జేయుచు నిష్క్రమింతురు.)

(శూర్పణఖ ప్రవేశించును.)

శూర్ప—(తనలో) ఇప్పుడుగదా నాకు కన్నుల పండువుగా నున్నది. మాయన్నలీతని నెట్లులైన సాధింపఁగలరు. ఆహా! ఏమీ? మహా సంగ్రామమున నన్ను బరిభవించిన దురాత్ముండగు లక్ష్మణుండు గూడా నుండిన బాగుండును. కానిమ్ము త్వరపడనేల? ఒకరివెనుక నొకరిని సాధింతుగాక. యుద్ధ మీ సమయమున నెట్లున్నదో చూచెద, (కొంచెమునడచి నిలచిచూచుచు) బలే నాకిప్పుడెంతయో యానందముగ నున్నది. దానవసేనలెల్ల వర్ష ధారాపరంపరల చాడ్పున నద్దురాత్మునిపై బాణములఁ గురి పించుచున్నారు— ఆహా ? వీడెంతబలశాలి! యెందరుశరములు రువ్వినను నన్నిఁటిం దప్పించుకొనుచుఁ దన శరంబులచే దైత్యుల

సుగ్గోనరించుచున్నాడు ఇప్పుడేమగునో చూడవలయు. (కొంచె ముచూచి) అయ్యో! అయ్యో! ఇంకేమున్నది! దైత్యులు చచ్చిపోవుచున్నారు ఓరీ దుష్టుఁడా! నీ చేతులు కాలిపోను, ఎంత యన్యాయముఁ. జేసితివిరా? తాళుము, తాళుము మా యన్నలమాత్రము బ్రతికింపుము. నీకు పున్నెము వచ్చును. హా! హా! కార్యము మించిపోయినది దైవమా! ఇప్పుడేమి చేయుదు (అని యించుక విచారించి) కానిమ్ము, ఇద్దురాత్ము నెట్లైన సాధింతుగాని యూరకవిడుతునా? ఇప్పుడే రావణుని కడకేగి యున్నసంగతికంటె గొన్నిగల్పించి చెప్పి, కోపము వచ్చునట్లొనరించి నీనిం జంపింతుగాక (పండ్లుకొరకుచు నిష్క్రమించును.)

(తెరలేవ యుద్ధభూమి రక్తమయమై భీకరముగా గాన్పించును)

రాము——(ప్రవేశించి! అరరే! రణాంగణ మిప్పుడెంత భయప్రద ముగా నున్నది. అవిగో గ్రద్దలు మాంసఖండముల నోటగరచు కొని పోవుచున్నవి ఈ నాడు విహంగముల కెంతయు నానం దము కలిగియుండును. ఆహా! ఏమి విచిత్రము.

సీ॥ ఘనతరంగముల నిఃస్వనములిచ్చుచుఁ బారు
రక్తంబె విమల జలంబుగాక
పటు శౌర్యయుత మహా బాహుదండంబులే
భయద పన్నగ కదంబంబుగాగ
లసితపాండుర చామర వ్రాతములె కిన
ద్గౌర డిండీరసంతతులుగాగ
బహుళవిస్తృత శిరోరుహ సంచయంబులె
కమనీయ శైవాల గణముగాగ

తే॥ గీ॥ ఘనతరాస్థులె పులిన సంఘములుగాగఁ
గనులఁజూడఁగ నతిభయంకరము నగుచుఁ
దనరుచున్నది సంగరాంగణములో హి
తాంబుపూరిత శోణనదంబు పగిది॥

ఇప్పటికి శాత్రవులు సంపూర్ణముగా నిహతులైరి. నన్నొక నిముస మెడబాసియు నెఱుంగని ధరాతనూజ పర్ణశాలకడ నెట్లున్నదో సత్వరంబున బోవలయు. ఇంకను నెవ్వరైన రాక్షసులు తలసూపిరేని వధింతుగాక.

(నిష్క్రమించుచున్నాఁడు.)

(రంగము: రావణుని గృహము)

(రావణుఁడు, శూర్పనఖ ప్రవేశింతురు)

శూర్ప — హా! ఎంతపరాభవ మెంతపరాభవము! త్రిజగన్నుతుండైన దశకంఠుని చెలియలికి నేఁడెంత మహాపద కలిగినది!

రావణు — సోదరీ! ఇది యేటి మూర్ఖము? నీకింతటిపరాభవము కలుగఁ జేసిన యాపాపిం దెలుపుమన్న నేల తెలుపవు? వాని నిప్పుడే నాయీఖడ్గముచే నింతింత ముక్కలుగా గోసి గ్రద్దల కాహారముగఁ జేయకుందునా?

చ॥ ఘనబలుడైన యట్టి దశకంఠుని సోదరివైన నిన్ను దా
మనమున శంక లేక యవమానితఁ జేసిన యా దురాత్ముఁ డా
చెనటి నెఱుంగఁ బల్కుము శచీధవుఁడో గిరిజాధినాథుఁడో
ధనదుఁడొ కాక యింకెవఁడొ ధారుణిఁ గూల్చెద నద్దురాగతున్॥

మదీయ బలశౌర్యంబు లీవెఱుంగని దానవుగావు. నా హృదయంబున నిప్పుడు చిచ్చు ముట్టించి నట్లున్నది. రయంబున దెల్పుమా! ఆ పాపి యెవఁడు వాని రుధిరపానంబుగాని యీ చిచ్చు చల్లార నేరదు.

శూర్ప — అన్నా! ఏమని తెల్పుదు? త్రిజగద్విఖ్యాతమైన దానవ వంశంబునఁ బుట్టి నేఁటికొక హీనుండగు మానవునిచేఁ పరాభవ—

రావ — (అడ్డమువచ్చి కోపముతో) ఆ, ఆ, మానవుండె యింతటి కార్యమునకు సాహసించెగా? ఘోర! దుష్కృతీ! ఎవఁడురా నీవు? రావణుని కోపవహ్నుల కాహుతి కాదలంచితివి కాబోలు. క్రూరాధమా! మానవుండవగు నీవెక్కడ రావణుని చెలియలగు నీమె యెక్కడ? మట్టు మర్యాద లెఱుంగక కండకావరం

బున నింతటి దుష్కార్య మొనరింతువా ? తత్ఫలం బనుభవింప జేసెద నుండుము. సోదరీ! అద్దురాత్ముం డెందు వసించు చున్నవాఁడు.

శూర్ప—ప్రస్తుతమున పంచవటంబునందు.

రావణు—(ఆగ్రహమున లేచి) అరే, మర్త్యాధమా ! నీవిప్పు డెందు జనగలవు? స్వర్గమర్త్యపాతాళాది లోకంబుల నెందు డాగినను నిన్నీ రావణుండు విడువఁడు. నీ విప్పుడు మృత్యువు నోటఁబడిన వాడవైతివి. ఇదే వచ్చుచున్నాఁడ (అని నడుచుచున్నాడు).

శూర్ప—(అడ్డమువచ్చి నిల్చి) అన్నా ! శాంతింపుము. మరికొంచెము చెప్పవలయు. అద్దురాత్ముని గెల్వ నెట్టివాఁడైన జాలనట్లు తోచెడిని. త్వరపడకుము. అత డసాధ్యుఁడు.

రావణు—(కోపమున) సోదరీ! తెలిసి తెలిసి యెట్లు మాట్లాడితివి.

మ॥ బలశౌర్యోన్నతి నిందుగ్రనిం దరిమి సప్త ద్వీప విశ్వంభరా
వలయం బందునఁ గీర్తిగన్న నను గెల్వంగ రాదు ఫాలాక్షునం
తలనత్తేజుని కైన నట్టియెడ నెంతైనన్ మనుష్యుండు న
న్గెలువన్ నేర్చునె ! నాకసాధ్యులిల నెందే నుందురే? సోదరీ!

ఇఁక నా రాక కడ్డము రాకుము. శాత్రవనికరకంఠ ప్రదేశరుధిరధారారుణ భయంకరంబైన మదీయకరవాలంబున నద్దురాత్ముని నరకి వాని రక్తముఁ బానము చేసి మాంసము భుజించువరకు నాకు నిద్దుర పట్టనేరదు. ఇదే, మదీయ ప్రతిజ్ఞ నాకర్ణింపుము పాకశాసన పావకపరేతరాట్ప్రముఖు లడ్డమైవచ్చి పోరిన పోరుదురుగాక!

మ॥ చటులాభీల దవానలంబు వృషదశ్వప్రేరితంబౌచు, ది
క్తటముల్ వెల్గ మహాటవీస్థలుల వేగంగాల్చు చందాన నే
బటుదోశ్శక్తి వెలుంగ మద్భుజయుద కోపాటోప ఘోరాగ్నులన్
త్రుటిలో నమ్మనుజాధమాధముని గాల్తున్ లోకముల్ మెచ్చగన్.
నాకడ్డము లెమ్మా (అని సత్వరంబున నడచుచున్నాఁడు)

శూర్ప—(పట్టుకొని) అన్నా! నిల్వుము. మఱికొంచెము చెప్పవలయు (యోజించి) ఓహో! మఱచితి. నీకుం జెప్పదగిన యంశమే యిది. కొంచెము కూర్చుండు వేని వచింతు.

రావ—అంతముఖ్యాంశమా? ఏదీ, చెప్పుము.

శూర్ప—ఏమని వచింపగలను. నేఁజెప్పిన వానివేరు రాముఁడు. అతని తమ్మునివేరు (పండ్లు పటపటకొరికి) లక్ష్మణుండు. తండ్రిపను పున నరణ్యములం దిరుగ వచ్చిరి. రాముండను వానికొక భార్య కలదు. ఆహా! దానిం దలఁచిన మది నొకవికారము కలుగుచు న్నది. అబ్బా! ఏమాసౌందర్యము! ఏమాలావణ్యము?

రావ—అంతటి రూపవతియా?

శూర్ప—రూపవతియేమిటి! దాని మందగమనంబును, జిరునవ్వు, మేని సొగసు, కనులయందము, మొగముచందము, చెక్కిళ్లతళుకు, చూపులబెళుకు, వేయేల దాని సకలావయవసౌష్టవంబున నెంతైనను వంకలేదు. తగినయన్నమునకుఁ దగినకూర దొరకదనునట్లు పురుషుఁడు మాత్రము దానికిం దగిన వాఁడుకాఁడు. పాపమది యేమిచేయఁగలదు?

రావ—ఎన్నటికైన నాకది లభించునా?

శూర్ప—ఆహా! ఇంకేమికావలయు? నీ కది లభించు నేని రాజ్యంబులును, వాహనములును, మణిమయాభరణంబులును వేయేల, సకల సంపదలును, తుదకు దేవేంద్రుని భోగము గూడ నంతసుఖములు కానేరవు. దానిం దెచ్చి నీకీయవలెనని నే నెంత యోప్రయత్నముఁ జేసితిగాని తుదకు నాకే పరాభవమైనది. నీవా తరుణికిం దగినవాఁడవు. నీకది తగినయువతి. నీవు దానిఁ జేపట్టితి వేని పసిడికిఁ దావి యబ్బినట్లుండును. పలువిధంబుల నాలోచించి యెట్లులైన దానింగొని వచ్చు నుపాయ మాలోచింపుము. యుద్ధమున మాత్ర మాతని గెల్చుట కష్టమని తోచుచున్నది. వాఁడు ఖరదూషణాదులఁ గూడ నట్టురాత్ముండు వధించినాఁడు.

రావ—ఆ! ఏమీ! ఎంతపని చేసినాఁడు కానిమ్ము. ప్రస్తుత మా మదవతి పై నామనమేగుచున్నది. ఎట్ులైన దానిం దేకున్న నిలువజాలను.

శూర్ప—ముఖ్యముగా నీక త్తరుణియుండవలసినదే (నిష్క్రమించును).

రావ—ఆహా! శూర్పణఖ నాటిన వాగ్బీజమున మోహాంకురము హృదయక్షేత్రమున నుద్భవించినది. నే నిప్పుడేమి చేయవలయు? నాకు మనోవైకల్యముగూడ గలిగినది. ఔరా; మదనుండెంత యసాధ్యుండు! ఏమి, వానిబలము! దేవేంద్రుని వజ్రాయుధంబునకైన నొవ్వని మదీయదేహంబు నీతఁడు పూబాణములచే నలయించెఁగదా! మన్మథుఁ డెంతవాఁడు!

సీ॥ సన్యాసులమటంచు • జడలు పెక్కులు బెంచి
నీల్గువారల నిష్ఠ • నీటగలిపి
విజితేంద్రియులమని • విఱ్ఱవీగెడువారి
గర్వమంతయును భంగంబొనర్చి
ఘనులమటంచు కాననసీమల వసించు
మౌనుల ధైర్యంబు • మంటబెట్టి
కాంతాజనంబులఁ • గనులఁ జూడమటంచు
పల్కువారలదీక్ష • బాదు సేసి

తే॥ గీ॥ ఇక్షుఖండశరాసన • మెక్కువెట్టి
కుసుమబాణపరంపర • గూర్చి భూరి
బలముచే ద్రిజగంబుల • గెలచినట్టి
యసమశరుబారిఁ బడని సాహసుఁ డెవండు?

చ॥ అమరులపాలిమృత్యువు, ధనాధిపుగెల్చిన మేటి భూరిశౌర్యము దిశలన్ వెలుంగ రజతాచలమెత్తిన సాహసుండు విక్రమజితవాసవుం డరి కులాంతకుఁడీ దశవక్త్రుఁ డద్దిరే
సుమశరుగెల్వ లేదుగద చోద్యముచోద్యముచోద్యమెంతయున్

కానిమ్ము. ఆమదనుని పరితాపముమాత్ర మెంతవరకుసాగును! నా ప్రియురాలు నాకు లభించువరకు నిప్పుడు నేనేమిచేయుదు? మదనబాణానల పరాజితుండనై యున్న నా కమ్మదవతిం దెచ్చి

సామర్థ్యమెట్లు కల్గు? (యోచించి) మంచియుపాయము తోచినది. ఇప్పుడే మారీచునికడకేగి యాలోచించి, వానిసహాయంబున నీ కార్యంబు నిర్గించుకొందునుగాక.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

(రంగము: మారీచుని గృహము)

(ప్రవేశము:—మారీచునితో రావణుఁడు)

రావ—ఓయీ! నే నిప్పుడొక కార్యార్థినై యుండి నీవలన గొంత సహాయముఁగోర నేతెంచి యున్నాఁడను. ఎట్టివానికైన నొకప్పుడు గాకున్న నదొకప్పుడైన నొరుల సహాయము తప్పక కావలసి యుండునుగదా. ఎప్పుడేని సహాయముఁ బడిన నీకు ప్రత్యుపకారము నే నవశ్యము చేయగలను. ఏమందువు?

మారీ—రాజా! నీవు ప్రత్యుపకారము చేయవలయునా! ఉత్తము డెప్పుడును బ్రత్యుపకార మపేక్షించి యొరులకు సాయమొనర్పఁడు. నా యోపినకొలది మీకు సాయమొనరించెద. కార్య మెఱింగింపుడు.

రావ—నినుఁబోలిన స్వార్థత్యాగుల కిది యొక గొప్పపనికాదు.

తే॥ గీ॥ సుఖము గష్టము నొకటిగా • జూచుకొనుచు
నిరతముఁ బరోపకార తాత్పరతగలిగి
కార్యసాధన మొనరించు • ధైర్యశాలు
రైనవారికి భువి నసాధ్యంబుగలదె?

మారీ—అట్లని ప్రతి కార్యమును యుక్తాయుక్తజ్ఞానములేక త్వరపడి చేసినచో నొకప్పుడద్దాన ననేక కష్టములు వాటిల్లుట గూడ గలదు.

రావ—కష్టము లెప్పుడో కలుగునని మొదటనే కార్యసాధనమునకు బ్రయత్నింపకుండుట వీరపురుష ధర్మమా ? నీటిలో దిగకున్న లోతు తెలియుటెట్లు? ఒక కార్య మారంభించునపుడుగదా దానివలన గలుగు కష్టసుఖములను లాభనష్టములను దెలిసి కొనఁ గలుగుట.

మారీ—అనాలోచితముగా నొక కార్య మారంభించి యది తుద ముట్టకమున్నే నడుమగల్గు కష్టములకుఁబాలై పశ్చాత్తాప మొందుటకంటె ప్రథమమున నయ్యది సాధ్యమా లేక యసాధ్యమా యని యోచించి పిమ్మట కార్యారంభ మొనరించుటే సుజ్ఞానులకుం దగిన పని. ఇంతకు దామే తెంచిన కార్యమెరిగింపరైతిరి.

రావ—తెలిపెద వినుము. ఒక దినమున మదీయసోదరి యగు శూర్పనఖ పంచవటీప్రాంతమునకేగ నొక మర్త్యాధముండామె నాసాకర్ణములఁగోసి పరిభవించె. అద్దురాత్ము నెట్లైన సాధింపవలయు. మఱియు నతని కొకభార్య కలదని నా చెలియలు వచించె. దాని సుందరాకారమును గూర్చి యామె వచించిన దెంతయు నే జెప్పజాల. ఇంతయేల ? దేవకాంతలకైన నంతటి సోయగము లేదట. ఓయీ! ఇంకేమని వచింపఁగలవాడను.

ఉ॥ ఆరుచిరాంగికన్ వినినందాదిగఁ బంచశిలీముఖుండు దు
ర్వార బలాఢ్యుడై సునుశరంబుల నన్నలయింపసాగె నే
తీరున నాకు నమ్మదవతిన్ సమకూర్చెదో నాదు ప్రాణ మే
తీరున నిల్పెదో ? భవదధీనుఁడనైతి, నికేమిపల్కుదున్.

ఎట్లైన నాతని నెదిరించి యా సుందరాంగిం దేవలయు.

మారీ—రాజా! పరాంగనల గోరుటయే గొప్పతప్పు. అందకాంత గుణములెట్టివో, ఆయమ యెవరో, తెలియనిదే యిట్లు త్వరపడిన లాభము లేదు. మోహానల దందహ్యమానుండవై యుంటచే నీ కీవాక్యములు రుచింపకుండ వచ్చును. కాని నీ వమ్మను జూఁడెవ్వడో విచారించితివా ?

రావ___ ఆఁ విచారించితిని. అతండొక క్షత్రియవంశ సంభూతుఁడు. తండ్రిపనుపున భార్యతో నరణ్యముల కేతెంచెనట.

మారీ___ఆతని నివాసమేమో తెలియునా ?

రావ___అయోధ్య.

మారీ___ఆతని నామమరసితిరా ?

రావ___రాముఁడఁట

మారీ___అబ్బా ! ఎంతకార్యము తలపెట్టినాడవు? అమ్మహామహుని మానవమాత్రునిగా దలంచితివి కాఁబోలు. భాస్కర కుల సుధాబ్ధిన రాకాహిమకరుండై దుష్టజన శిక్షార్థ మిల నవతరించిన త్రిభువనాధారుండగు ఆ రాముడు నారాయణుండు సుమా ?

రావ___(నవ్వి) ఓయీ నీ వింతటిధైర్యశాలివని నే నెప్పుడు దలఁపలేదు. గవ్వకుఁగొరగాని మానవాధము బట్టుకెవడి నిట్లు పొగడెదవేల ? పొగడుటయందైన, మితితప్పి, రాయిగుద్ది నారాయణుఁడని పల్కెదవేల ? ఇంత విపరీతమెందుండును ! విష్ణుదేవుండు మనుజుఁడయ్యెనన్న నే బుద్ధిహీనుఁడు నమ్మునో కాని, నేనమ్మజాల. నీకట్టి పిచ్చినమ్మక మెట్లు కలిగెనో, లేక ననుఁ బరీక్షింప నిట్లాడెదవో తెలియదు.

మారీ___ఎంతచెప్పినను నీమూర్ఖత్వము విడువకున్నావు. పైకెట్లందువే కాని నీకుమాత్రి మతనిపరాక్రమము తెలియదా ! ఇఁక నీనీకోరిక నీ మదినుండి తొలంగించుటమేలు.

రావ___(కించిత్కోపమున) ఓయీ ! పిరికిపందా !

ఉ॥ ఢక్కలుఁదోలు చాపున నకుంఠితశక్తిఁ బురందరాదులన్
గ్రిక్కునఁ బారద్రోలి త్రిజగన్నుతుఁడై వెలుగొందు రావణుం
డెక్కడ మన్నభూచలము నేనియు బోలని నీచమానవుం
డెక్కడ చాలుఁ జాలు నిఁక నిల్పుము నీదువృథాప్రసంగముల్
ఎవరేని నీమాటలువిన్న నవ్వెదురు.

మారీ__నీవు నామాట లబద్ధమని తలంచితివేమో! అట్లెంచకుము. రాముఁడాదినారాయణుఁడు. ఆతని భార్య లోకమాత. ఇందెంత మాత్రము సందేహింపఁబనిలేదు. ఆతని పరాక్రమము నీవు పూర్తిగ నెఱుంగవు. బ్రహ్మాదులకైన నమ్మహామహుఁ డసాధ్యుఁడు, వర్ణనాతీతుఁడు. అవాఙ్మానస గోచరుండు. వినను నాశక్తికొలఁది యాతనిం జెప్పెద నాలకింపుము. ఎవ్వనికీర్తి దిగంతములవరకు వ్యాపించియుండునో, ఏ సచ్చిదానంద మూర్తిం దలంచిన నఖిల పాపంబు లడంగునో, యట్టి జనార్దనుని గా నతని నెఱుంగుము. మరియు,

సీ॥ భండనాంగణ మహోద్దండ చండ కృపాణ
ఖండితోగ్రారాతి మండలుండు
అమరేంద్రవినుత యోగ్య సరోజహితవంశ
కలశపాథోధి రాకావిధుండు
సుందరమందార కుందచందన సుధా
సింధుసన్నిభ యశోబంధురుండు
రాజేంద్రమకుట విభ్రాజితానేక ర
త్నప్రభాలసిత పాదద్వయుండు

తే॥ గీ॥ సుగుణశోభితుఁ డమల తేజోయుతుండు
నలఘుమతి భూరిసారదయాపయోధి
నీచ దానవదళన కళాచణుండు
ఘనచరిత్రుండు రాముఁడో దనుజనాథ!

రావ__అమ్మానవాధముని వర్ణన పూర్తియైనదా? ఇంకను గొరత యున్నదా? ఆహా! నిన్ను నేను ప్రథమమున నెంత ధీరుఁడవని యెంచితినో యిప్పుడంత పిరికివని యెఱింగితి. నీవొక్కండవు జన్మించుటవలన దానవవంశమంతయుఁ బాడై పోయినది. ఎక్కడనో మానవునిఁ జెప్పెదవుగాని నిర్జరుల గెల్చి దిగీశ్వరులజయించి బ్రహ్మచే వరములంది రజతాచలం బెత్తిన సాహసుండ నగు నాముందు వాఁడేమిటఁ జాలును?

మారీ—రావణా! ఆతనిచరిత్ర మించుక జెప్పెద. సావధానుండవై ఆలకింపుము.

ఉ॥ అమరులగెల్చినన్ సమితి • నష్టదిగీశులఁ బారదోలినన్
కమలజుచే వరంబు లధి•కంబుగఁగొన్నను గొండనెత్తినన్
విమలయశో విరాజి రఘు•వీరున కద్దియె యెందునున్ శతాం
శమునకునైన నీవతని • సత్వమహత్వము లెన్న శక్యమే ?

రావ—చాలునదియుఁ జాలనిదియు, నిప్పుడు కాదు తెలియుట. సమరాంగణంబునఁ బరాక్రమంబు గనుపరచినవేళ నెవరెక్కువో యెవరు తక్కువో తెలియు; నూరక డంబము లేల పల్కెదవు ?

మారీ—నీవు నాసహాయముఁ గోరివచ్చితివి కావున, నొకమాట చెప్పెద వినుము. నీమదింగల దుర్బుద్ధి నడచుకొని రాముని యెడ భక్తి కలిగియున్న మేలగు. ఇదియే నా సహాయము. నీవు సబాంధవముగ నాశనము కాకుండ హితోపదేశముఁ జేసినాఁడను. నమ్మితివా, బాగుపడుదువు. లేదా చెడిపోదువు.

రావ—ఛీ ? దుష్టుఁడా! నీ దురూపదేశము లింక గట్టిపెట్టుము. సీతను దేకుండ నుండవలెనని నీవెన్ని చెప్పినను వినువాఁడనుగాను.

మారీ—దనుజేంద్రా!

చ॥ జడియక ముద్దుకై ఘనభు•జంగముతో జరలాటలాడగా
గడగినభాతి నిప్పు లొడి•గట్టఁ దలంచిన యట్లు వహ్నిలోఁ
బడ మది నెంచుచందమున • బ్రాణభయం బినుమంత లేక యా
పడతిని రాముపత్ని సతి•పావని నిట్లు హరింపగోరుదే?

నీవిందుకుఁ దగినఫలము ననుభవింపక తప్పదు. తెలివిమాలిన పని జేయకుము. చక్కగా యోచించుకొనుము. త్వరపడి దుష్కార్యమునకు సాహసింతువేని పిమ్మట శ్రీరామ శరానలంబున శలభంబు లట్లు దానవసేనలు మడియువేళ నమితంబగు పశ్చాత్తాప మందవలసివచ్చు. నా వాక్యము లమృతోపమానములు సుమీ! తిరస్కరింతువేని మేలు చేకూరుట దుస్సాధ్యము నీకింకను నాతనిగురించి చెప్పెద వినుము.

రావ—ఇంక నీ పంచాంగము గట్టిపెట్టుము. తమ్ముఁడు వెడలగొట్టి ననాథవోలె నడవులకు భార్యతో నేతెంచినవానిశూరత్వము వేరే చెప్పవలయునా ?

మారీ—అట్లాతని తిరస్కరింపకుము. ఒకవేళ కార్యార్థియైవచ్చియుం డునుగాని తమ్ముని గెల్చి నగరమున నుండఁజాలు నుపాయము తోచక కాదు

మ॥ కడుబాల్యంబునఁ దాటకం దునిమె లోకంబెల్ల మోదింప గీ
టడఁచెన్ దైత్యుల నెందరెందరినో దేవానీకముల్ మెచ్చ నే
ర్పడరన్ ధూర్జటికార్ముకంబు నవలీలం దుంచె బృందారకుల్
పడకుం జెందగ నట్టి ముని జయింపన్ శక్యమే యేరికిన్ ?

ఇంతియకాదు మరియొకటి వినుము మునిజనముల హోమములెల్ల నాశము జేయుచు, యజ్ఞకుండముల బురీషాదులఁ బడవైచుచు గోలసేయు దానవులబారి కోర్వలేక మునులు వేడిన మీఁద శరాసనపాణియై యీ రామచంద్రుఁడే మదీయజననియగు తాటక నొక్క కోలచే వధించె సుబాహు నేకబాణమున దుంచె నాపైని నొకశరము ప్రయోగించెగాని నీకిప్పుడుపాతోపదేశము జేయుటకై కాఁబోలు నాపుపేక్షించి బాణము ప్రాణములదీయక నన్నీ ప్రాంతమునఁ బడవైచె అట్టిబలశాలి యగు రాము నెంతని మనము పొగడఁజాలుదుము. కమలభవుండైన నశక్తుఁడన్నఁ జిత్రముకాదు.

రావ—(కోపముతో) ఇఁక నాకిన్ని మాటలు పనికిరావు. నేనిదే బయలుదేరుచున్నాను నీవును బయలుదేరుము ఇదే నా ప్రతిజ్ఞ. నిరంతర శంకరారాధన పరాయణుండ నేని కమలసంభవదత్త వరబలాన్వితుండ నేని యఖండతేజో విరాజియగు పులస్త్యునకుం దనయుండ నేని,

ఉ॥ ధారుణి కుంగినన్ దివిని దారలు రాలిన వహ్నులారినన్
నీరధు లింకినన్ దినమణీందులు [illegible] నస్తమించినన్

ఘోరున రాముఁడడ్డమయి • పోరిన సీతనుదెత్తుగాని నే
నూరక రాను ముజ్జగము • లొక్కటియై యనిసేయవచ్చినన్.

మారీ—(కోపమున తనలో) ఓరీ దుర్మదాంధ ! కండకావరవు కూత లేలవేసెదవు. జయించుటకు మునిచేశాపముదిని మేనెల్లకన్నులైన దేవేంద్రుఁడనుకొంటివా ? (ప్రకాశముగ) దానవసంఘాత మదోత్కటసమూహ భీకరహార్యక్షసమానుండగు రాముఁడు సుమీ ! జాగ్రత ! అతని గెల్వ నీయబ్బకునుదరముకాదు. నీవంటిరావణులు కోట్లువచ్చినను అమ్మహాత్ముఁడు దోమలపగిది నలిపివేయఁగలఁడు. వేయేల? ఇదేమదీయ వాక్యంబులారింపుము. నీవాసాధ్విందెత్తువేని.

ఉ॥ ధారుణికృంగినన్ బుడమి • దారలురాలిన వహ్నులారినన్
నీరధులింకినన్ దివమణీందులు దక్షిణమందు దోచినన్
ఘోరునశంభుడడ్డమయి • పోరిన శ్రీరఘురాముఁడాజిలో
ఘోరశరానలార్చి నినుఁ • గూల్పకమానఁడు దానవేశ్వరా !

ఈమాటలు ముమ్మాటికి నిజమునిజము సత్యము సత్యము

రావ—(ఆగ్రహముతో) దుర్మతీ ! ఇదే కడతేరితివి (అని తన ఖడ్గముపైకెత్తి మారీచుని నరుకబోవును)

మారీ—(ఖడ్గముఁబట్టుకొని) తాళుము తాళుము. నీవెంటవచ్చెద (నవ్వి) వెఱ్ఱిరాజా ! నీవింతత్వరపడియెదవేల ? నీహృదయమెట్టిదో తెలియ నిట్టిప్రసంగ మొనరించితి. నీవు కనుఁగొనఁజాలవైతివి. ఒక మనుజుఁడెందైన విష్ణుదేవుఁడగునా ?

రావ—(మారీచుని వీపుచరచి) బలే ! మారీచా ! నాహృదయము నింతకలతబెట్టిన సమర్థుఁడవగు నీవెంతకార్యమైన సాధింపఁగలవు. సీతందెచ్చుటకిక బయలుదేరుదమా !

మారీ—ఇదియేమంచిసమయము. ఆలస్యమేటికిచేయవలెను సత్వరంబున సీతందెచ్చిన సౌఖ్యము లనుభవింపఁగలవు. పాపము నీమద నాగ్నియు నడుగఁగలదు. అప్పటినుండియు నిన్ను వ్యర్థప్రసంగములచే గలయించినందుకు క్షమింపుము.

రావ——మారీచా! ఆగ్రహపడి, నిన్ను నరకవచ్చినందులకు నీవే నన్ను క్షమింపవలయు.

మారీ——ఇటురమ్ము (అని రావణుని చెవిలో నేదియో చెప్పును).

రావ——(సంతోషమున మారీచుం గౌఁగలించుకొని) బలే మారీచ! ఇట్టి యుపాయశాలివగు నీవుతలంచిన నొకటి యసాధ్యమగునది కలదా? నీవు గట్టిగా పట్టువట్టిన.

తే। గీ॥ అబ్జభవునైన గానల • కంపఁగలవు
దేవపతినైన భిక్ష మెత్తింపఁగలవు
చెలఁగి ముల్లోకములు బూది • జేయఁగలవు.
అనఘ! నీచేతఁగాని కార్యంబుగలదె ?

అట్టి నీవొకమానవుని మాయజేసి యొకస్త్రీని వశ్యపరచుకొనుట కష్టమా?

మారీ——కొన్నిసంగతులు మాటలాడవలయు. అయ్యవి మార్గమున బోధించెద లెమ్ము. ప్రయాణమగుదము.

(నిష్క్రమింతురు)

(యవనిక జారును)

శ్రీమద్భగవతీ కటాక్ష సంపాదిత కించిత్కవితా
జ్ఞాన సమేత, మల్లాది గోపాలకృష్ణ ప్రణీ
తంబైన సీతారామ వియోగ
మున ద్వితీయాంకము

బ్రహ్మార్పణము.





శ్రీ

# సీతారామవియోగము.

## తృతీయాంకము.

(రంగము:—దండకారణ్యమున పర్ణశాల)

(రామలక్ష్మణులు సీతాసమేతులై ప్రవేశింతురు)

లక్ష్మ—అగ్రజా! శాత్రవ సమూహంబును రణాంగణంబున నుసు మాడిన తెరం గెఱింగింపుఁడు వినఁగోరెద.

సీత—ఔనౌను నేను నదియే యడుగఁదలఁచియుంటిని. ప్రాణేశ్వరా! సమరంబున మీవెంటనిలిచి వీక్షించుట కదృష్టింపకున్నను దనుజుల నిర్జించిన భంగిఁ దెలిపి మమ్మానందపరుపుఁడు.

రామ—అబ్బా! సంగ్రామరంగంబునఁ గల యా చిత్రంబుఁ జూచి తీరవలయునే గాని చెప్పనలవికాదు. నే నిప్పుడు నింత ఘోరయుద్ధము సలిపి యెఱుంగ. తమ్ముఁడా! దనుజులసేనలు కాటుకకొండలో, చీకటిమూఁకలో యనునట్లు వచ్చినపిదప నేనును ధైర్యమువహించి, శత్రుసేనాభిముఖుఁడనై నిలిచితిని. అప్పు డమ్మనుజాశనులు ప్రళయకాలోద్దండ దండధర భీకరాకారులై దిగంతములు నిండఁ బర్జన్యారావమును మించు మహార్భటములతో నిఖిలశస్త్రాస్త్రధారులై కవిసి కోదండ ప్రచండంబులగు గదాదండములచేతను నమోఘంబులగు శరౌఘంబులచేతను నను నొప్పింపసాగిరి.

లక్ష్మ—అబ్బా! అంగరక్షకులు కవిసినప్పు డొకఁడు సాహసించి నిలువఁగలఁడా? మిమ్ముబోఁటి శూరాగ్రణి యెందును లేఁడు తరువాత నేమైనది?

రామ—అంతనేనును బాణాసనమెక్కువెట్టి రోషకషాయితాత్ముండనై రాక్షసులపై ననేకదివ్యశరముల నిగిడించి పరాస్త్రములు ప్రయోగించితి అప్పుడుగల విచిత్రము జూచినగాని తీరదు ఆహా! అదియే వీక్షింపఁదగిన సమయము. పెక్కుతునియలై నేలఁగూలిన రథంబులును, దండంబులు దునిసియు నంగంబులు వ్రచ్చియు కుంభంబులు పగిలియు, కులిశపాతగిరి సంఘాతముం బోలి పడియున్న కరిసంఘాతములును దెగిపడియుఁ బండ్లుకొరుకుచు నార్చు వికట దంష్ట్రలతోడి తలలును, చంగుచంగున నెగురు కబంధములును, జూచుట కెంతయు రౌద్రముగను భయంకరముగను నాశ్చర్యముగను దోఁచె మఱియు నాసమయంబున,

సీ॥ అదె యేడ్చుచున్నవాఁ • డద్దిర తమ్మునిఁబట్టి
ధరఁ గూల్చెఁడనుచు బి • ట్టరచువారు
కదనరంగమునందు • బెదరినవాజీంద్ర
ఖురపుటాహతి నేలఁ • గూలువారు
తమయాలుబిడ్డలఁ • దలఁచి శోకింపుచు
శస్త్రానలార్చులఁ • జచ్చువారు
బ్రతికియున్న శుభంబుఁ • బడయవచ్చు నటంచు
భయమున వెన్నిచ్చి • పారువారు

తే॥ గీ॥ అంతకుఁడె సుమీ వీఁడఁచు • నబ్బురమున
సంచితంబుగ నన్ను నగ్గించు వారు
కరచరణహీనులై భూమిఁ • బొరలువారు
గలిగి సంగ్రామరంగంబు • వెలిఁగె నహహా!

అట్లు కొంతతడవు ఘోరంబుగాఁ బోరి, తుదకు దుష్టుఁగు నద్దనుజులనెల్ల వధించితి దానవవధానంతరంబున యుద్ధభూమి మిగుల భయంకరమై యొప్పె. అప్పుడు ప్రవాహములై పారు రుధిరంబుపైఁ దేలు మాంస ఖండంబుల మెక్కుచు తనివిదీరఁ

దదరిక్తపానము సేయుచు స్వేచ్ఛగా విహరించు ఖగమృగ సమూహంబు లెక్కకు మిక్కిలియై యుండె. ఆహా! దానినెంత ని వర్ణింపఁగలను?

సీత—నాథా! సంగరశ్రమచే నింకను మీరు బడలియున్నట్లున్న వారు కొంచెము విశ్రమింపరాదా!

రాము—బడలికయే? నాకింకను గొందరు రాక్షసులతోఁ గయ్యము సేయవలయునని కుతూహలము జనించుచున్నది.

లక్ష్మ—దుష్టశిక్షణమునందు శూరులగువా రెప్పుడును దృష్టిఁ జెందరుగదా?

సీత—(తత్తరమునఁ బొంచి పొంచి చూచుచు) ఆహా! అదియేమో కనుంగొనుఁడు. కనులు మిరిమిట్లుగొల్పుచు ప్రకాశించుచున్నది. (ఇంచుక పరికించి) అబ్బా! ఏమి దీనియందము! ఏమి యా నిగనిగలు! ఏ మా సుందరము!

తే॥ గీ॥ కాంచనము పైన రత్నంబు • లంచితముగఁ
జెక్కనవితాన నిగనిగల్ • పిక్కటిల్ల
మెరువుఁదీగెయొ యన నదే • తిరుగుచున్న
దాకమనోహరమైన మృ • గోత్తమంబు!

రాము—(ఆత్రమున) ఏది ఏదీ! ఎటుబోయిన దామృగము? (అని దిక్కులు పరికించుచున్నాఁడు)

సీత—నాథా! ఇటు ఇటు! ఆహా! ఏమి దీనియందము! ఇట్టి యపూర్వవిలాస శోభితమగు మృగమెచ్చటిదై యుండు? ఔరా! ఏమి యాసుందరము. మనోహరా! నా కామృగమును ప్రాణములతోఁ బట్టియిచ్చిన బాగుండును గదా. తుదకు దానిచర్మమైన దేకున్న నామనము నిండదు. అయ్యో! పోవుచున్నది. ఓ కురంగమా! పరుగెత్తకుము. నీపై నేనెంతయు నాసపడియున్న దానను (ఇంచుక పరికించి) అదిగో! పొదల నిటవచ్చుచున్నది. చూడుఁడు దానిశోభ.

సీ॥ సిద్ధంపుతళుకుల • నెగజల్లు జాళువా
మెరుగుల నీను నెమ్మేనిసొబగు
మేఘమాలలమధ్య • మెరయు విద్యుల్లత
జిగిగేరు దేహంపు • జకిలితీరు
ఇంద్రనీలపుమణు • లెనగాని నిగనిగల్
నలుదెసల్ గ్రమ్ము కన్గవబెడంగు
మేల్మిబంగరున నిర్మించిన పద్మప
త్రములన నొప్పు కర్ణములనీటు

తే॥ గీ॥ చూడఁజూడగ నెంతయు • జోద్యమయ్యె
ఔర ! దీనిని సృజియింప • నబ్జభవున
కెన్నియుగములు పట్టెనో • యెఱుఁగఁజాల
నహహా ! నామది దీనిపై • నరిగె నేఁడు.

ఎటులైన దానిం బట్టుకొని వచ్చి నాకు రిపెను: దీర్ఘవలయు. నా ప్రార్థన మంగీకరింపుఁడు.

లక్ష్మ—అమ్మా ! ఆ పాడులేడి చిక్కునా ?

రాము—అనుజా ! ఏమంటివి, లేడియే చిక్కదా ?

సీత—అయ్యో ! అది పాడులేడియా, ఎంతమాట! పాపమది మనకేమి చేసినది? ఎట్లాడుకొనుచున్నదో చూడుమా. దానికంతు లెంత మనోహరములు? నాథా! జాగేటికి? త్వరలో నా కాకురంగమును బట్టి యీయ మిమ్ము వేడుకొందును.

రాము—సతీ ! త్వరపడకుము. పట్టి తెచ్చెదగదా.

లక్ష్మ—ఊరక ప్రయాసపడుటయే కాని నునకది చిక్కునా ? (సీతతో) తల్లీ! నీకీనాఁడా లేడికన్నుల కేటికగపడె? మాయన్నగారు సంగరశ్రమచే నెంతయు దూలియున్నారు. నీవు మరింత శ్రమపెట్ట జూతువేటికమ్మా ! ఈ లేడి కాకున్న మరియొకలేడి నింకొకప్పుడు పట్టుకొనగూడదా ?

రాము—తమ్ముఁడా ! ఎట్టిమాటాడెదవు ? సమయమున కక్కరకు రాని వస్తువు నిష్ఫలమేకదా ! ఇప్పుడిమ్మగువ యెంతవేడుక

పడియో నొకకుంగరముం దెమ్మన్న దాని నెప్పుడో తెత్తుననుట యేటి సంగతి ? మన మద్దానిదేకున్న నిప్పు డీమె చిన్నబుచ్చుకో నదా? ఒకప్పుడును నాకిదికావలయునని నోరెత్తి యీమె మనల యాచించి యుండెనా ?

ఉ॥ ఎన్నఁడు గోరనట్టి జలజేక్షణ నేఁడొక చిన్నలేడిఁ దె
మ్మన్న నసాధ్య మయ్యది యటంచు వచించుట భావ్యమానె ; నే
పన్నుగ దాని నీ క్షణమె పట్టుకవచ్చెద నంతదాక నీ
వి స్నలినాక్షిఁ జూచుచు వసింపుము పర్ణగృహంబు సన్నిధిన్.

సుందరీ! నీ కోర్కె దీర్పనిదే బయలుదేరుచున్నాఁడ (పోఁబో వును.)

లక్ష్మ—(అడ్డము వచ్చి) అయ్యో! నేఁడిదేమి, నీ వింతమాత్ర మూహింపకున్నాఁడవే! ఇప్పుడీ లేడిం దేకున్న నేమగును? అద్దానిం బట్టనేగినచో నది యెంతోదూర మేగినగాని చిక్కదు. అంతదూరమునుండి మార్గము గనుగొని తిరిగి పర్ణశాలం జేరుట కష్టముకాదా ! దారితప్పిన నేమగును ?

రాము—(నవ్వి) వెఱ్ఱివాఁడా! ఇదియా నీయూహ ? సరి సరి. నన్ను తుదకు మార్గముగూడ గనుగొనలేని తెలివితక్కువవానిగ భావించితివా ? ఆహా ! ఏమి నీబుద్ధి ! ఇంతకాలమునుండియు నా వెంటనుండి నీవు గ్రహించిన దిదియా ? ఒకవేళ నేనట్టివాఁడ నైనను చిన్నవాఁడవగు నీ వట్లనఁజెల్లునా ? తనకన్నఁ బెద్దవా నితో నడ్డుమాటలు చెప్పుట బుద్ధిమంతుల లక్షణమా ?

లక్ష్మ—(స్వగతము) అయ్యో! నేనెంత దుష్టుఁడనైతి! మేలొనగూర్ప బోవఁ గీడుఁచ్చుననుట యిట్టిదేకదా. ఊరకుండుమన్న మన సొప్పదు. మాటాడిన నన్ను మాయన్న మూర్ఖునిగాఁ దలంచును. కానిమ్ము. ఎట్లైనను జెప్పకున్న వీలుపడు. నాశక్తి కొలఁది వచించి చూచెద. (ప్రకాశముగా) అగ్రజా! దానవి పరాభవించినపిమ్మట నది తనబంధుజాలముం దీసికొని రా, నమ్మను జూసనులఁగూడ నంతమొందించితిరి. ఇప్పుడది వనమైె మిక్కిలి

కోపించియుండవచ్చును. రాక్షసులెంతటివారైనను సాహసింతురు. అందాడుదానిని బొత్తుగా నమ్మరాదు. ఏవేళ నేమిచేతురో? కావున నీక మనవనవాసదీక్ష పూర్తియగువరకు నడుమైన బైట బెట్టక జాగ్రతగానుండుట మంచిది. ఇప్పుడీకురంగమువలన నేమికీడు వాటిల్లునో తోచదు. ఈప్రయత్నము మానుట మంచిది. ఇదే నాకు వామనేత్రి మదరుచున్నది. అన్నా నామాటవినుము.

రాము—పిచ్చివాడా! ఎందరనో దనుజులజంపినవాని కొకయాడుది లెక్కా? (యోచించి) ఓహో! తెలిసినది ఇదియా నీయుద్దేశ్యము?

ఉ॥ ఒక్కడ వీకుటీరమున • నుండ భయంబును జెంది నేడు నీ
విక్కరణిన్ వచించెద, వి • దేటి మగంటిమి? శూరవర్యు లీ
ఫక్కిని జంకువారె పరి • పంథిభయంబుల భీకరాజిలో
నుక్కడగింతు వెట్టు లిపు • డొంటిగనుండ భయంబు జెందినన్.

సీత—నాథా! గట్టిగ నాకోర్కెదీర్పవలయు. లక్ష్మణున కంతభయమైన నాతనిఁగూడ మీవెంట గొనిపొండు; నేనొక్కదాన నోక్కింత సేపటులో తాళియుందును. (స్వగతము) ఆహా! ఇది యేమి, నా కీనాడు దక్షిణనేత్రమదరెడిని; కానిమ్ము. ఈసంగతి వెల్లడిజేసిన నాకీకురంగము లభింపదు; అయ్యో! దీనిచే నాథున కేమియు నాపద వాటిల్లదు గదా! పోవలదనిచెప్పుదునా? ఛీ! ఏమి నా దురూహలు; జగదేకశూరుండగు నా నాథున కొక కురంగమునుబట్టుట యసాధ్యమా? ఐనను, నేనంతగా బలవంతము చేయను. ఎటుబోయి ఎటువచ్చునో, వారి యిష్టము.

లక్ష్మ—అగ్రజా! ఎట్టిమాటలాడెదవు? నేనొక్కడ నుండ భయపడియా యిట్లంటిని? ఆహా! ఎంతమాట! నాకుమాత్రి మాయమకోరికె దీర్పవలెనని యుండదా? నాకు వామనేత్రస్ఫురణ మొదవుటచేతను, దనుజులతో విరోధము కలుగుటచేతను, సంశయించి పలికితినిగాని మరియొకటి గాదు; ఇది మాయాకురంగ

మే యగును. దనుజమాయ లతివిచిత్రములు. గట్టిగా పోవలదని పల్కిన నమంగళములందురని సాహసింప జాలకున్నాడను.

రాము — ఇప్పుడు నీవు పల్కినవన్నియు నమంగళములు కాక మంగళములా ? ఎంతపిరికివాఁడ వోయి? (సీతంజూచి) పాప మీతనన్వంగిం జూడుము తనకోర్కె నెరవేరలేదని చింతించుచున్నది. అయ్యో ! ఇది భావ్యమా ! (సీతతో)

చ॥ తరుణిరో ! చిత్తమందు గలఁతన్ సహియింపకు మిప్పు డేను స
త్వరగతి నీవుకోరిన విధంబునఁ జయ్యన దత్కురంగమున్
కరమనురక్తి బట్టుకొని • గ్రక్కున దోడ్కొనివచ్చె దేఁడు నీ
మురిపెముఁ దీర్తు నీకుఁ గడు • మోదము గూర్తు సరోజలోచనా!

ఇదే పోవుచున్నాఁడ (అని ధనుర్బాణముల్గొని నిష్క్రమించును)

లక్ష్మ — ఆహా! విధివశంబు దప్పించుకొన నెట్టివానికైన నశక్యము గదా ! నేనెంత చెప్పినను భార్యమైఁగల గాఢప్రేమచే నవియెల్ల బెడచెవిని బెట్టి మూర్ఖునివలెనె యింతగ్గ్యోగ యోచన సేయకయే చనుచున్నవాఁడు (యోచించి) ఆనవాతుమ్మ నట్లనఁ జెల్లదు అతండు సర్వజ్ఞుడు. కానిమ్ము ఏది యెట్లు కావలసి యున్నదో, అది యట్లు కాకమానదు. ఎవరెన్ని యాపదల నొందుచున్నను ఎందరికి నష్టము చేకూరుచున్నను, కాలపురుషుం డిసుమంతయు నవియోచింపక తనస్వేచ్ఛానుసారము వర్తించుచుండును నేఁడింతి లినలాభము లేదు పట్టభద్రుఁడు కానున్న రామచంద్రుఁడు నారచీరలు ధరించి కందమూలహారుఁడై భార్యతో గహనంబుల నివసించుట కాలపురుషుని చేష్టాచమత్కారము గాక మరియేమి? ఆహా! అవియన్నియుఁ దలంచిన గుండెలు బ్రద్దలగుకదా !

తే॥ గీ॥ సర్వమెఱిఁగిఁ చరించు సుజ్ఞానికైన
నవని జ్యోతిషవిదునకు • నైన దుర్లకు
హరునకైనను శతకోటి • ధరునకైన
కాలమహిమ నెఱుంగ శక్యంబె ధరణి॥

నేనిక చింతించుచుండిన ఫలమును లేదు. సాహసులగువారును క్షత్రియ వంశసంజాతులునగు వారికి ధైర్యమే భూషణము. అట్టివారలే

యెన్ని కష్టము లనుభవించినను యెంతదుఃఖము నోర్చినను తుదకు కీర్తివంతులగుదురు నేనిక జాగ్రత్తతో నీమె కేయాపదలు వాటిలకుండ జూచుచుండవలయు నాచేతనగుపనికు కాపాడెద. ఆపైన దైవమున్నాఁడు (నిష్క్రమింతురు)

(యవనిక జారును)

[రంగము___అరణ్యము.]

---

(రాముఁడు లేడిం దఱుముచు ప్రవేశించుచున్నాఁడు)

రాము___(తనలో) అరరే! దీని యందమును నేనెంతయని కొనియాడఁగలను ఇట్టి లేడి నిదివఱకు కలనైనఁ జూచియుంటినా! ఈనాఁడు నాజన్మ మెంతయు సఫలమని తలంచెద ఇట్టి నిరుపమాన శోభావిరాజితంబగు కురంగమును కనులారఁ వీక్షింపఁగల్గు భాగ్య మెట్టి తపశ్శాలి కబ్బవలయు? నిక్కముగా నేను ధన్యుఁడను; ఇయ్యది నాచేఁ జిక్కిన బాగుండునుగదా (అని పొంచి చూచుచు) అదిగో! మరల నెక్కడికో పారిపోవుచున్నది ఇప్పుడు దీని వెనువెంట బరుగిడవలయును (అని లేడిని వెంబడించుచు.) ఆహా! ఏమి దాని జవము! ఏమి యా దేహకాంతి! జగత్కర్తయగు విధాత నిజ చమత్కారము లోకమున వెల్లడియగుట కీ మృగంబును సృజించెనో వు.

ఉ॥ కమలజుఁ డన్ని గన్నముల • గల్గు మెరుంగు గ్రహించి దీని చి
త్రముగ సృజించెనో హిమకరాంక కురంగము స్వీయజాతి రూ
ప్రమదముమీఱ ఘాడి వన • పంక్తులతో జరియింపవచ్చెనో
భ్రమ జనియించె దీనిఁ గనుఁగొనినంతనె నామనంబునన్॥

దీనియం దెట్టి ప్రభావంబు కలదో గాని నామదికి దీని నెంతజూచినను తనివి దీరుటలేదు. ఇంతటి చక్కదనముగలది యగుట చేతనే సీత నన్నింతగ బలవంతపరచి తుదకు లక్ష్మణుండు ఇంకిప్పుడు తానొంటిగ నుండుననియు, సౌమిత్రిని వెంటగొనిపొండనియు, వచియించె. ఆహా! నాకిప్పుడీకురంగముం జూచుటకు వేయికనులుండినను చాలవుగదా! అదిగో! ఆగురివిందపొదమాటున డాగి నను పొంచిచూచుచున్నది; అరరే,

దాని నేత్రములీ పొదచాటుననుండి యెట్లు ప్రకాశించుచున్నవి! దానిమోమెంత ముద్దు గారుచున్నది; ఇప్పుడు దీని గట్టిగ బట్టుకొందు. (అని లేడిని సమీపింపఁబోవ, నది పరుగెత్తును) ఇసీ! ఎంత తెలివిమాలిన పనిజేసితి? అయ్యది నను జూచుచుండగనె దానిపైఁగల ప్రేమవలన నే నెదురుగాఁ జనుటచే బెదరి పారుచున్నది. ఈపర్యాయ మిట్లుకాదు; ఎందైన డాగియుండి నిలిచినప్పుడు మెల్లగ వెనుకనుండి సమీపించి తటాలున బట్టుకొనవలయు. (అని యొకపొదచాటున డాగి) అదిగో! లేడి నన్నిప్పుడు చూడకయే, యందు నిలిచి పూరి మేయుచున్నది ఇదియే మంచిసమయము. (అని లేచి మెల్లగా నడుచుచు సమీపించునప్పటికి లేడి మరల పరుగెత్తును) అరరే, నాపాదములధ్వనిచే నియ్యది నారాక నెఱిగి పారినట్లున్నది. ఇంక నేనీకురంగము నెట్లు పట్టుకొనగలను? (లేడింజూచి) అదిగో నాకెదురుగా వచ్చుచున్నది సరే, దీనికిప్పు డలసట జనించినది. తప్పక చిక్కును. (కొంచెమాగి) ఆహా! మరల పరుగెత్తినది. ఏమి దీనిజవము!

చ॥ ఘనబలుఁ డేసినట్టి బలుకాండమునన్ వడిఁబారు నొక్కచోఁ
గనికరముంచినం గరుణఁగాచి భయంబునుదీర్చ నీవె ది
క్కనివటు లొక్కచో నెదురుగాఁ జనుదెంచుచు దీనవక్త్రయై
చని, వడిఁబట్టబోవ నురుసత్వమునం దరులెక్క నొక్కచోన్॥

అదిగో! లేడి యచ్చట శయనించినట్లు తోచుచున్నది. ఆహా! ఇంకను గొంచెము సేపిట్లు పరుండియుండిన దీని ననాయాసముగ బట్టుకొనవచ్చునుగదా! కానిమ్ము. దానికి నిద్రకూడ వచ్చినట్లున్నది; నయనములు నిమీలితములయ్యెడిని. అది గాఢనిద్రంజెందువరకు నేనిందే త్వరపడక వేచియుండి, పిమ్మట సులభంబుగా బట్టుకొనవచ్చు. (అని కొంచెమూరకుండి) ఇప్పుడీలేడికి పూర్తిగా నిదురపట్టినది. నాకింతకన్న మంచిసమయము దొరకదు. మెల్లగాబోయి నిశ్శబ్దముగా దానికొమ్ముల బట్టుకొనెద. పిమ్మట నాయుత్తరీయంబున బంధించి దాని కే

బాధయుఁ గలుగకుండ నెందైన జలము త్రావించి మెల్లగ సీత కడకుం గొంపోయెద. (అని పరుండియున్న లేడిని సమీపించి పట్టుకొనబోవ నది చివాలున నెగిరి పారిపోవుచుండును. విస్మితుడై) ఔరా! ఏమి దీనిటక్కులు! నిదురవచ్చినట్లు నటించెనే కాని దానికి సత్యముగ నిదుర రాలేదు. నేను మోసపోయితి. నాకిప్పుడు కొంచ మాయాసముగనున్నది (వెనుకకు దిరిగి చూచి) అబ్బా! నేను చాల దూరము వచ్చితి సీత పర్ణశాల కడ నెంతపరితపించుచున్నదో గదా! నాకీలేడిచిక్కుటెట్లు; నా ప్రియురాలి కోరికె తీరుటెట్లు? ఇంకేమి సేయఁగలవాఁడను? హా! కురంగమా! నన్నింతశ్రమలపాలొనరించుట నీకుం దగునా? అల్లల పరుగిడెదవు! నిలువుమా నీకు మ్రొక్కెదను. నిన్ను నా భుజముఁపై నిడికొని మోసికొని పోయెదను. నీకీసుమంతయు శ్రమ కలుగనీయను; రమ్మా.

సీ॥ పగవాఁడగాను నిన్ • బట్టి కొట్టుట కేను
చిత్తమందున భీతి • జెందకమ్మ
క్షోణీతనూజ నిన్ • గోరితెమ్మని పంప
వనవీధి దిరుగుచు • వచ్చితమ్మ
అటవిని వెదకి వే•సటజెంది కనులార
కడకు నిన్నొకచోట • కంటినమ్మ
దవ్వునకేగ కిం•తటనైన జక్కగా
త్రిజాత మురిపెంబు • దీర్పుమమ్మ

తే॥ గీ॥ తరుణి! నినుముద్దులాడంగ • దలఁచె నమ్మ
తీయనిఫలంబు లిడుదమ్మ • తినగదమ్మ
వేగ రావమ్మ నిన్ను నే•వేడితమ్మ
అలుక మనమున జెందక•మ్మా! మృగమ్మ!

ఓ హరిణమా! రమ్మా. నిన్ను పసిబిడ్డపగిది పెంచుకొందుము. నీకు ప్రతిదినము పచ్చనిపూరి దీసికొనివచ్చి కడుపార భుజింపఁజేయుదుము. నీవు సీతచే నెంతయుమన్నన నందగలవు. మాయరణ్యవాసదీక్ష పూర్తియైన పిమ్మట నిన్ను మాతోఁగూడ నయోధ్యకు

గొంపోవుదుము. నీవచ్చట మాప్రజలచే నెంతేని కొనియాడ బడుదువు. ఇంతియేకాదు మరియును వినుము.

సీ॥ దాసీజనంబు కుందనపు టుయ్యాలలం దుఁ
ప్రీతితో నిన్నుంచి • యూతురమ్మ
సేవకుల్ నోరూర • జేయు తీయనిపండ్లు
కడుపార దిన నీకు • నిడుదురమ్మ
సీతతో నా • మసీమల విహరింప
పోతులు నిన్ను • గొంపోదురమ్మ
కడుమెత్తనైన చక్కని పూలపాన్పుల
జెలులు నిన్ నిదురింప • జేతురమ్మ

తే॥ గీ॥ పుడమి నడుగిడనీక మా • పురిని జనులు
సంతతంబును నిను గౌర • వింతురమ్మ
యిన్ని మాటలు వచియింప • నేలనికవు?
నిన్నె మారాజ్యలక్ష్మిగా • నెంతురమ్మ!

అదిగో! మరల పరువెత్తుచున్నది హరిణము! నిన్నంతగా బ్రతిమాలుకొన్నను నాపై గరుణబూనవేల? అబ్బా! నాకు శ్రమగానున్నది, ఏమిచేయుదును? నా కీలేడిచిక్కునట్లు తోచదు ఊరక మరలిపోదునా? ఛీ! అదియు తగదు; ఇంతప్రయాసమును వృథాయగుటగాక సీతగూడ సంతోషహీనురాలగును. క్షత్రియవంశసంజాతుండనైన నేనొకలేడినిబట్ట నింత జంకవలయునా? కానిమ్ము ఇది యెంతదాక పరువెత్తునో చూచెద నేను నిక్కముగా క్షత్రియవంశసంభూతుండ నేని దీనింబట్టనైన బట్టుదు, అటు గాదేని,

చ॥ సరసిజమిత్రుం డుత్తర దిశన్ వడి గ్రుంకిన గ్రుంకుగాక భూ
ధరనిచయంబు లేకమయి • ధాత్రిని దొర్లిన దొర్లుగాక సా
గరజల మొక్కపెట్టున జగంబును ముంచిన ముంచుగాక యీ
హరిణము నేను చిక్కక శతాహతి ధారుణి గూల్తు సిద్ధతిన్

అంతియే గాని పౌరుషహీనునివలె యూరక రిక్తహస్తములతో దిరిగి పోదునా? అదిగో! హరిణమేగుచున్నది ఇప్పుడే దాని వెంటబడగిడుదు (అని లేడివెంట నురుకుచున్నాడు)

---



శ్రీ

# సీతారామవియోగము.

## చతుర్థాంకము

(రంగము: పర్ణశాల)

(సీతయును లక్ష్మణుఁడును ప్రవేశించుచున్నారు)

సీత—(లక్ష్మణునితో)

చ॥ హరిణముఁ బట్టనేగి తడ • వయ్యెను నాథుఁడు రాఁడు దప్పిచే
నొరగెనొ, యెండచే బడలెనో ! కట నాకిదె దక్షిణాంబక
స్ఫురణము దోచె నేచెడుగు • మూడునొ? కంపము చిత్తమందునన్
కరము జనించె, నీవెదురు • గా నయినం జనుమయ్య లక్ష్మణా !

లక్ష్మ—అమ్మా! త్వరపడ నేటికి? మాయన్న లేడిం బట్టుకొని వచ్చుచునే యుండును; నేఁబోయి మాత్రము చేయునది యేమి ?

సీత—ఓయీ ! అట్లందువేమి ? ఒకవేళ నెందైన దప్పిచే బడలెనో యేమో తెలియదు; నీవు కొంచెము నీరముఁదీసికొని యెదురుగా బోయిన తప్పేమి !

లక్ష్మ—జననీ ! నిన్నొంటరిగా నెట్లు విడచిపోఁగలను ?

సీత—నా కేమియు భయములేదు. నానాథునకన్న నెక్కువ యేమికలదు పోయిరమ్ము.

(తెరలో)

హా! తమ్ముఁడా! లక్ష్మణా! హా! సీతా

(అని గొప్పధ్వని వినవచ్చును)

సీత—(తత్తరపాటున సంభ్రమించి) హా! ఇంకేమున్నది, నేనప్పటి నుండియు నెంతచెప్పినను వినవైతివి కదా,

మ॥ వనిలో రాముని కెట్టి యాపద లహా! వాటిల్లెనో, 'తమ్ముఁడా!'
యనుచుం బెద్దయెలుంగునం బిలిచె నయ్యో! లక్ష్మణా! లెమ్ము కా
ననసీమన్ విలపించు సోదరునిఁ గావం బొమ్ము వేవేగ దో
డ్కొని నేమంబుగ రమ్ము నీవిచట జాగున్ సేయ కిప్పట్టునన్.

లక్ష్మ—తల్లీ! అట్లేల తత్తరపాటుఁ జెందెదవు? త్రిజగదేకవీరుండగు రామున కెట్టి యమంగళమును వాటిలదు చింతింపకుము.

సీత—(తత్తరమున) ఆహా! లక్ష్మణా! ఎంతబుద్ధిమంతుఁడవు? ఒకవంక నెలుగెత్తి తమ్ముఁడా యని మీయన్న విలపించుచుండ నిట్లుల పల్కెదవు?

ఉ॥ ఆపదఁబొంది ఘోరగహనాంతరమందున నగ్రజుండు సం
తాపమువొంది పేరెలుఁగునన్ నిను 'తమ్ముఁడ!' యంచుఁబిల్వ, నీ
వీపగిదిన్ గృపారస మొకింతయుఁ జూపక మిన్నకుందు వే
లా? పగవాఁడవో, కిరాతుఁడవో? నన్నున్ వెతఁబెట్టఁ జూచెదో?

కటకటా! నీకింతమాత్రమేల తోఁచదు? జనసంచారములేని ఘోరారణ్యమున నగ్రజుండాతీరున విలపించినను గృప బూనవేల?

లక్ష్మ—తల్లీ! నీవాధ్వని రామునిదంచు నెంచితివి కాఁబోలు కాదు సుమీ! ఈ ప్రదేశమునఁ గ్రూరులగు రక్కసులు తిరుగుచుందురు; మనల మోసపుచ్చి భ్రమింపజేయుటకై యట్టివారిలో నెవఁడేని యొకఁడిట్లరచియుండునే కాని మరేమియు లేదు. చింతింపకుము.

సీత—అయ్యో! నేఁడిది యేమి నీవిట్లు మాటలాడుచున్నాఁడవు? ఒక వంక విస్పష్టముగ నన్నగారి దీనారవము వినవచ్చుచుండ నీవు కాదందువేల? మొదటినుండి నీకన్నగారిపైఁగల మహానురాగము నేఁడంతరించెనా? ఆహా! ఎంతలో నెంతమార్పు గలిగినది!

లక్ష్మ—అమ్మా! నీవల్లెన్నటికిం దలంపకుము. మాయనురాగము లంతరించిన లోకమంతరించినట్లే. మా యన్నదమ్ములమైత్రి నెఱింగియు నీ వట్లందువేమి?

సీ॥ కుడిచితి మొకచోటఁ • గూడి బాల్యమునందు
మంజులాన్నంబు సంమ్మదముతోడ
ఆడితి మొకచోట • నతులితానంద మ
గ్నులమౌచుఁ దోడి బాలురనుగూడి
నేర్చితి మొకచోట • నిఖలశాస్త్రవిభయ
ప్రదమైన వరధను • ర్గాగమంబు
చదివితి మొకచోట • చతురరీతిని రాజ
నీతుల గురుని సా • న్నిధ్యమందు

తే॥ గీ॥ మేను లివి రెండు వేరైనఁగాని ప్రాణ
మేకముగ నెంచి మెలఁగితి • మెల్లచోట్ల
నిట్టి మాకొండొరులపైన • నెసగుప్రేమ
మాసిపోవునె వేయి జన్మములకునైన?

సీత—నీవు సత్యముగ నన్నగారియెడ నంతటి ప్రేమగలిగియున్న నన్నీ విధముగ నేల వెతఁబెట్టెదవు? సత్వరంబుగ నెదురుచని సాయ మొనర్పుమా! నిన్ను వేడికొనెదను, కఠినత్వమూనకుము.

లక్ష్మ—జననీ! సకల రాజరాజమకుటసంఘటిత మణినికరవిలసిత పదాబ్జుండైన శ్రీరాముగకు దేవివై, నాకు మాతృసమానవై, పూజ్యురాలవగు నీవా నన్ను వేడుట, ఎట్టిమాట!

సీత—సౌమిత్రీ! ఆపదవచ్చినప్పు డెట్టివానినైన వేడవలసివచ్చును. అందు నిన్ను నేవేడుకొనుటయం దేమియుఁ దప్పులేదు. ఏటికి జాగుసేతువు? రయంబునఁబోయి నాకుఁ బతిభిక్షఁబెట్టుము, లెమ్మ.

లక్ష్మ—తల్లీ! నీవిట్లు చింతిలఁ బనిలేదు; ఆ సేతుహిమాలయస్థభూభా గమ్మమండలంబున నన్న మహావీరు నెవ్వండేని గెలువఁజాలఁడు;

నిరర్గళ పరాక్రమవిరాజితుండైన యమ్మేటివీరున కేయాపదయు
వాటిల్లదు; అట్లగునేని చతుర్దశభువనంబులును దల్లడిల్లు; కు
లాచలములు తలక్రిందగును; మహార్ణవము లేకమగును; వే
యేల! త్రిమూర్తులును వడంకుదురు.

సీత—కటకటా! వృథా కాలము బుచ్చెదవే కాని, నా మొర లింపవు
కదా! ఆహా! నేటి కన్నగారిపైఁగల ప్రేమ నంతయు వదలి
తివా!

శా|| హా! తమ్ముండ! యటంచు నగ్రజుఁడు ఘోరారణ్యమధ్యంబునం
దేతోడుం గన కాత్మరక్షణకు పేరెల్గెత్తి, నిం జీరినన్
చేతంబం దనుకంపమూన వికనిన్నేమందు నమ్మాటకీ
"జ్ఞాతిచ్ఛేదనలేనకి" వమ్మనెడి వాచారూఢి నిక్కంబె కా.

లక్ష్మ—ఆహా! ఎట్టిమాటాడితివమ్మా! అరఘడియయైన నొండొ
రుల మెడబాసియెఱుఁగక ప్రాణమొక్కటిగ మెలఁగు మా
యందు జ్ఞాతివైర మున్నదియు లేనిదియు నీవెఱుఁగవా?

సీత—ఎఱుఁగుదును! ఇకనైన నాయం దనుకంపము వహింపుమా!
నీహృదయమింత దయావిహీనమని నేనెన్నఁడు దెలియనైతి
గదా!

లక్ష్మ—జననీ! రామచంద్రున కడవిలో నేదియో యాపదకలిగియుం
డునని తలఁచి నీవట్లనుచుంటివే కాని నేను దయావిహీనుండ
నైనదియు కానిదియు నీ వెఱిఁగియున్నదే.

సీత—అబ్బా! ఎంతకు గదలకున్నావు, నేనింతగ నా గ్రక్కనె పలుమారు బ్రతి
మాలుకొనుచున్నను, నా మాట చెవిని బెట్టుదు వన్ను
వేపుచున్నాఁడవే! ఇది నీకుం దగునా? ఇకనైన బయలుదేరుమా,
కార్యము మించినపిమ్మట జేయునదేమి?

లక్ష్మ—ఏటికి నిట్లు దిగులుజెందెదవమ్మా! నామాట వినుము
సూర్యచంద్రులు గతులదప్పినను రామునకు హాని లేదు.

సీత—ఔరౌరా! నిన్నేమనవచ్చును? ఆతీరున నగ్రజుండు విలపిం చుటవినియు నించుకయైన జింతలేక, [illegible]నకు హాని లేదని, సమాధానము జెప్పుచుంటివి [illegible] దా. (యోజించి) ఆహా! ఇదియా నీయభిప్రాయము? అన్నన్నా! ఎంత [illegible]! ఎంతదుష్టుడవు!

చ॥ మఱిదివటంచు, నన్ను యెడ • మక్కువనుంచెదటంచు, మాయెడ గరుణగలాఁడవంచు నిను • నాత్మఁ దలంచుచునుంటిఁగాని, నే నరయఁగఁజాలనైతిని తృణావృతకూపసమాను నిన్ను, నే డెఱిగితి నీదుదుశ్చరిత; • మెంతదురాత్ముఁడవయ్య లక్ష్మణా!

లక్ష్మ—(ఉలికిపడి) (తనలో) ఆహా! ఏమిది? నన్నీనాఁడీమెయిట్లు తూల నాడుచున్నదేల? ఆహా! నన్నుఁగపటిగానెంచినదికాఁబోలు. దైవ మా! నాకెంతచిక్కుఁదెచ్చిపెట్టితివి! నేనిప్పుడుగట్టిగాఁబోనన్న చో నింక నన్నీమె యెన్నివిధముల దూషించునో? పోయినతప్ప క చేటుమూడును. నేనిప్పుడేమిచేయుదు? సాధ్యమగునంతవరకీమె తో చెప్పిచూచెద (ప్రకాశముగా) తల్లీ! నన్నేల తూలనాడెదవు? త్రిభువనైకవీరుండగు మాయన్న కేయాపదయుఁగలుగదు. ని న్నొంటిగ నీయడవినుంచి పోవుటకు జంకుచున్నాఁడను.

సీత—ఔరా! ఇంకను బోవుటకు జంకుచున్నాఁడవా! ఇప్పుడుగదా నీదుష్టత్వమంతయు గ్రహించితి! ప్రథమమున మాయెడ నెంత భక్తిఁజూపినాఁడవు! ఎంతవినయముగఁబ్రవర్తించినాఁడవు! నేఁటి కదియెల్ల నీటఁగలిపి యిట్టి పాపపుంజేతల కొడిగట్టుచుంటివా! అయ్యో! ఇంక నానాథునిఁగాచువారెవరు? నాకేదిదిక్కు? ఓరీ దుష్టుఁడా!

మ॥ బలుకాపట్యము మాటుజేసి నయమౌ • ప్పక్ గోముఖవ్యాఘ్రముం బలె, మందాకగనంబునం దనరు సర్పంబట్లు వర్తించు ని న్నెలమిన్ దుష్టుఁడవందుఁ బాపివని మాతృద్రోహివంచున్ మదిం దెలియంజాలక మోసపోయెగద బు • ద్ధిన్ నాథుఁ డీనాఁ డహా!

ఒకవేళ నేనజ్ఞానవశంబున మూఢుండనై యేదేనిలోపముగాని యపరాధముగాని జరిపియున్నను కుమారునకు, తల్లి నీతి నుపదేశించినట్లు నాకు బుద్ధిగరపుటకు నాకు నీవు స్వతంత్రురాలవుగదా! అట్లుజరిపిన నీయాజ్ఞదండదాల్చియుండనా? తల్లీ, నన్నుదురాచారునిగను మాతృద్రోహిగను దలంచితివి కాబోలును! పొరబాటుపడితివి; నాయందనుకంపము వహించుము.

సీత—ఛీ దుష్టుండా! అగ్రజునిచావుగోరు నీదుష్టవర్తన గుర్తించితిగాని నే బొరపాటువడితినా? ఏమి నీకండకావరము! ఆతమ్ముండు రాజ్యమపహరించి కానలకంపినను, ప్రాణములుమాత్రము దక్కనిచ్చె; నతఁడే యోగ్యుఁడు. దుర్మతీ! నీ వన్న హతుడైన నాయన సర్వస్వముహరింపనెంచిన క్రూరుఁడవు. నిన్నేమి చేసినను బాపము లేదు. (విషాదమునభినయించి) హా! మనోనాథా! నన్నీ పెద్దపులి కప్పజెప్పిపోతివా? కపటములేనితమ్ముఁడనికదా నీవిద్దురాత్ముం జేరదీసితివి? నే సీతవిచే నే నీకు మహాపద తటస్థమయ్యెగదా!

లక్ష్మ—జననీ! నన్నేల దుష్టునిగ నెంచెదవు? ఏటికిట్లు చింతించెదవు?

శా॥ అమ్మా! యేటికి కన్నుఁగొమ్మలను నీ వవ్వారిగా నిట్లు బా
ష్పమ్ముల్ గార్చెదు? రామచంద్రు నెదిర్పం ద్ర్యక్షశంభుం డోపండు లో
కమ్ముల్ బెగ్గిల నీమహావిభుఁడు సంగ్రామమ్మునన్ శత్రుబృం
దమ్ముల్ స్వీయధనుర్విముక్త వరబాణజ్వాలలం గాల్చుం భువిన్.

శ్రీరామునకు గలనైన నశుభము వాటిల్లదు. త్రిమూర్తులేకమయినను మాయన్న నెదిరింపఁజాలరు నీవింక శంకదక్కియుండుము. ఆతం డిప్పుడే మారీచుం గూల్చి రాగలఁడు.

సీత—(వినుపించుకొనకయే) హా! మనోహరా! నిన్నాహరిణంబు దెమ్మని నే నేల పంపితి? పంపితిబో నన్ను గూడ నీతోగొని యేలపోవైతివి? ఆమాయారక్కసి నిన్నేమైన బాధించెనో! దానిబంధువులు నిన్ను బట్టుకొనిరో? నీకింక సాయమువచ్చువారెవరు?

సీ॥ అసమాన కలిత మాయావను త్రోచు వర్తించు
చెనటిదైత్యులచేత • జిక్కినావొ
హరిణంబుబట్టంగ • బరువెత్తి పరువెత్తి
తుది నతిశ్రమచేత • దూలినావొ
బడలియుండినవేళ • పైఁబడ్డ వనమృగం
బుల ద్రుంపలే కార్తి • బొందినావొ
తీక్ష్ణాతపంబునఁ • దిరిగి యోర్వగలేక
గురుపిపాసవహించి • కుందినావొ

తే. గీ॥ అక్కటా! నాకు నీవదనాంబుజంబు
గనులఁజూచెడుభాగ్యంబు • కలదొ లేదొ
హా! మనోహర! నినువిడ • నాడి ధాత్రి
నొక్కక్షణమైన జీవించి • యుండఁగలనె ?

నాథా! నీకర్పణమైన యీదేహము నిద్దురాత్మునకీయఁజాల. ఇదే ప్రాణత్యాగముఁజేసికొందు.

లక్ష్మ—(వారించి) అమ్మా! అంతటిసాహసముకూడదు.

సీత—ఓరీ కుటిలహృదయా! ఇఁకనాతోఁబ్రసంగింపకుము! మాతృసమాననగు నాయందిట్టిదుశ్చింతజేసిననీవు భూలోకంబున గాకున్న నంతమందాలోకమునసైన తప్పక శిక్షార్హుండవు కాఁగలవు. చెట్టుడిగిపోవుకాలమునఁ గుక్కమూతిపిందెలు కలుగునట్లు వినాశకాలము సమీపించుటంబట్టి నీకిట్టివిపరీతఁపుకోరికజనించినది ఇఁక నీవిచ్చట నుండఁదగవు.

చ॥ అతులితప్రేమఁ బిన్నతన • మాదిగ నిన్ నిజగర్భజాతుఁడౌ
సుతుపగిదిన్ నిరంతరముఁ • జూచునిజాగ్రజునిన్ వధించి, త
త్సతిఁ గొననెంచినట్టి దురాత్ముఁడ వీవిఁక నిన్నుఁజూడ దు
ష్కృతముఘటిల్లు వే తొలగు • మిచ్చటినుండి మహాగ్రపాతకీ!

లక్ష్మ—(చెవులుమూసికొని) తల్లీ! నీవాక్యములు మహాబాణములు, దుర్భరములునై యున్నవి; నన్నింక నలయింపకుము. నీకిదే మ్రొక్కెద. నీయాజ్ఞానుసారము వర్తించెద.

సీత—ఓరీ! నిన్ను లయించుటయే కాదు, నీమేను గత్తికొక కండగాఁగోసి కాకముల కాహారముగా నొనరించినను బాపమువచ్చునా?

లక్ష్మ—జననీ! నీవాక్శరప్రయోగ మొకక్షణమాత్రముచాలింపుము. హృదయపుట మిదివరకే చిల్లులువడియున్నది. నీవింకను, బాధింపఁజూచెదవేల? నాపైనింకను నీకనుగ్రహము జనింపకున్నదా! నన్ను కుటిలహృదయుండని దూరుటయుక్తాయుక్తవివేక ధురీణ వగు నీకుందగదు. మాతా! సత్యమువచించుచున్నాఁడను! వినుము. అసత్యమునోటినుండివచ్చిన మిన్ను విరిగి పైఁబడవలయును. మరంబున నింతకన్న వేరొకదుశ్చింతలేదు. మున్మాటికిలేదు. ఆ హరిసాక్షి, సమస్తదేవతలుసాక్షిగా వచించినాడను. నాహృదయమున నేచెడుతలంపును లేదు.

సీత—ఛీ పాపకర్ముఁడా! నాయెదుటినుండి తొలగిపొమ్ము. ఈపఞ్చాత్రమైన నరకభీతిలేక మాతృసదృశనగు నన్ను దుర్మదాంధుఁడవై కామించియుఁ బవిత్రులగు వారిం బేర్కొందువేల? నీకింత మాత్రమైన లజ్జలేదా! నన్నిక మందలింపకుము.

లక్ష్మ—(కించిత్కోపమును విషాదమునునభినయించి) జననీ!

ఉ॥ యోచనలేకయిట్లు పరు • షోక్తుల బావకతప్తఘోరనా
రాచములట్లు కర్ణకుహ • రంబులఁ జొన్పెద వేటి కమ్మరో!
నీచరణంబులాన విను • నిక్కము రామునకున్ శుభంబు త
ల్లీ! చనుమందు వేని యటు • లే యిదెపోదు విచారమేటికిన్?

(కొంచెమూరకుండి) అమ్మా! ఏమియాజ్ఞ? నిన్నొంటిగనీమహారణ్యమధ్యంబున విడిచిపోవుటకు కాళ్లాడకున్నయవి! నీవుగట్టిగా పోయిరమ్మన్నఁబోయివచ్చెద! నానతిమ్ము.

సీత—ఓరీ! మహాద్రోహీ! భ్రాతృప్రేమ నీకున్నయెడల నేఁబొమ్మన వలయునా?

లక్ష్మ—(తనలో) దైవమా! ఇంకను నాపైనీమెకోపము విడువదయ్యె. ఈమహాటవి నిప్పు డీయమ నీవిధంబున నొంటిగా డించిపోయిన,

నేదనుజులవల్ల నేయాపదలుకలుగునో యెట్టిచిక్కులు మూడునో తెలియదు.

ఉ॥ భూమిజనొక్కతెన్ విడచి • పోయిన "ఘోరవనాంతరంబునన్
భామనుడించివచ్చుటిది • పాడియె?" యంచు మదగ్రజుండు న
న్నేమియొనర్చునో చనఁ • యే నిటనుండిన నీమె వాక్ఛర
స్తోమముచేత నన్ దునుమ • జూచెడి; నెయ్యది త్రోవ దైవమా!

అటుచూచిననూయి, ఇటుచూచినగోయిగానున్నది. నేనిప్పుడేమిచేయుదును? కర్తవ్యమేమి? ఏదియుదోపకున్నది. (ఆలోచించి) ఎటులైన బోవకతప్పదు. నేనింకను గట్టిగబోవనందునేని యీమె ప్రాణములనైన సంత్యజింప సంసిద్ధురాలై యున్నది. దైవమేమిచేయునో తెలియదు. ఇప్పుడు నేనుపోవుటకన్న గర్తవ్యము లేదు. (సీతతో) (ప్రకాశముగా) జననీ! ఆగ్రహం బుడిగి నా చేయుమనవి నొక్కింతయాలింపుము.

సీ॥ జడబుద్ధినైన నా • యెడల నెంతేతప్పు
లుండిన జిత్తమం • దుంచకమ్మ
కామతినై దురా • గ్రహమున నేనన్న
మాటల నన్నింటి • మఱువుమమ్మ
ఇదె వేడుకొందు ని • న్నెవలోనఁ గోపంబు
వీడి దయాదృష్టిఁ • జూడుమమ్మ
తొలుత సీతాజ్ఞను • ద్రోసిరాఁడనటంచు
నెంచకనన్నుమ • న్నించుమమ్మ

తె. గీ॥ అగ్రజునిచెంతకియ్యదే • యరుగువాఁడ
నాత్మఁగుందక సెలవిచ్చి • యంపుమమ్మ
రాముఁ డేనును గలసి శీ • ఘ్రముగ వత్తు
మెలమి నందాక జాగ్రతన్ • మెలగుమమ్మ.

అమ్మా! నీవు సాధ్వీమతల్లివి. నన్ను దీవించి పంపుము.

సీత—సత్వరంబున బోయిరమ్ము.

లక్ష్మ — తల్లీ! ఇదేపోయివచ్చెద. పర్ణశాలకడ మెలకువగలిగియుండుము. (అనికొంచెముదూరమునడచి తిరిగిసీతనుజూచి) అయ్యో! ఈమె నీయరణ్యంబున నెట్లుడించిపోదును? ఏకౄరజంతువుల గాంచిభీతిల్లునో! ఏదుష్టదానవులేమిహాని జేకూర్తురో? ముందేమి ముప్పువాటిల్లనున్నదో? దైవమా! ఎంతటిచిక్కులు దెచ్చిపెట్టితివి? మాయన్న నాకు కనుపింపకున్న మువ్వురముమూడు దారులై దుఃఖింతుమే మో కదా! పురుషులమగు మే మెట్టికష్టముల నైననోర్తుముగాక. ఒంటిరియై మమ్ము బాసిననీమె కష్టము లెట్లనుభవింపగలదు? ఆర్తజనావనా! నారాయణా! ఎందున్నను మావదినెను చల్లగాజూడుము. ఓగగనమా! రాముఁడువచ్చువరకీమెకే యాపదలు రానీయక కాపాడుము. (భూదేవికినమస్కరించి సీతనుచూచుచు నిష్క్రమించుచున్నాఁడు).

సీత — (తనలో) ఆహా! లక్ష్మణునిశాంతము. కడుంగడువర్ణనీయము. నేనెన్ని దుర్మాటలాడితినిగాని నాపైనిసుంతయు గోపమూనడయ్యె. ఆయన చెప్పినట్లిది యంతయు రాక్షసమాయయేయై యుండునేమో? నేనుత్వరపడి యేమియుందోపక దుఃఖవశంబున నట్లంటి గాని సత్యము విచారించిచూచిన లక్ష్మణుండు మిక్కిలిసత్యస్వభావుండని చెప్పుట కేమియు సందియము లేదు. కాకున్న నింతకాలము నుండియు నన్నగారియాజ్ఞను జవదాటక భార్యనువదలి మాతోబాటరణ్యంబుల నిడుములం గుడువ నాయనకేమిపని? నేనిసుమంతయునాలోచనలేక పాపము సన్మార్గవర్తనుండగు లక్ష్మణు నెన్ని విధములనో దూషించితిని. నిక్కముగా నిదిదనుజమాయయె. కాకున్న నొక్కహరిణంబును బట్టలేక జగదేకశూరుండగు నాధుఁడార్తుండై తమ్ముని జీరునా? ఒకవేళ రాక్షసులెవ్వరైన నడ్డము వచ్చిరనుకొందును. వచ్చినమాత్ర నేమిచేయగలరు?

తే. గీ॥ బాల్యమున దాటకను ద్రుంచి • భయదమైన
హరునిచాపంబు విరచి భీకరబలాఢ్యు
లైన ఖరదూషణులగూల్చి • నట్టిఘనున
కెవ్వరడ్డముపచ్చిన నేమిభయము?

ఇప్పుడు లక్ష్మణుడు గూడనేగెగావున నిరువురుగలసి యెవ్వరడ్డమువచ్చినను తప్పక గెల్చి క్షేమముగనిచటికి రాగలరు. నేనిక చింతింపవలసినపనిలేదు. పాపమునిర్దోషియగు సౌమిత్రినిదూరుటనాఁడిగొప్పతప్పు. ఎన్నటికిని విచారించి యేపనియైనఁజేయవలెనుగాని యనాలోచితముగ నిట్లుత్వరపడరాదు. కానిమ్ము, ఇంక విచారించిననేమిఫలము? వారిరాక కెదురుచూచుచుండెదఁగాక.

(అంతవల్కలాజినముదాల్చి సన్యాసియై రావణుడు
ప్రవేశించుచున్నాడు)

రావణుడు___(దూరమున నుండి సీతను జూచుచు తనలో). అదిగో నేను కోరిన జగన్మోహన విగ్రహము. మొగులావరించిన తొగల చెలికాని పగిది, మసిపాతగట్టబడిన యింపగు కెంపుపెంపున కాంతి తరిగి సామాన్య వస్త్రముధరించి, భూషణములులేక, నిర్మలమంద మలయానిలాందోళిత కమలాకరాంతర పద్మినీలత విధంబున దూలుచున్నది. ఆహా! ఏమి యీసుందరము!

సీ॥ స్వర్గవాసుల సుధా • శనులఁజేయఁగ జతు
ర్భుజుఁడు దాల్చిన సతీ • రూప మనఁగ
హరియురమ్మును వీడి • ధరణిపై విహరింప
వచ్చిన భార్గవీ • వనిత యనఁగ
జమ్మేటి యదనున • గ్రొమ్మించు జిగి కల్పి
బ్రమ్మ చేసిన కీలు • బొమ్మ యనఁగ
భవుని యర్ధాంగమ్ము • వదలియేతెంచిన
పర్వతేశుని ముద్దు • పట్టి యనఁగ

తే॥ గీ॥ బరగు నీయింతి దామర • విరులబంతి
సందములదొంతి బూవిల్తు • సరిదిదంతి
గనుల గనుగొనినంత షం • డునకునైన
గాని పుంస్త్వంబు రయమున • గలుగకున్నె.

వేలకొలది, గరుడ, గంధర్వామరాది సుందరాంగుల జూచి యుంటిగాని వారందరీమె వామపద నఖాంచలములైన బోలుదురా! ఆహా! యీ నా నోములపంట నీకళారాశి, నీరతినతీ తులిత సీతర్వాంగి జూచుటకు నాకు కమలసంభవు డొక వేయి కన్నులైన నీయడుగదా!

సీ॥ చిగురుటాకుల మేలు • సొగసు జూచి హసించు
నల మింటమెలుగు రిక్కలనుమించు
నిండుపున్నమరేయి • నెలను బుట్టను బెట్టు
వదరెడు కొదరు తుమ్మెదలగొట్టు
చిరుదొండపండుగాంచి యసహ్యమునదూరు
కమనీయమైన శంఖమును మీరు
కలువసోయగము డాకాల మూలకు దోయు
గోకయుగ్మమును సిగ్గువడఁజేయు

తే॥ గీ॥ కాంచనముఁ దిట్టు బూరెమ్మ • గడకుఁబెట్టు
నరరె! యీ మానినీ పద • కరరుహాస్య
కుంతలాధరకంఠ చక్షుఃపయోజ
దేహహస్తము లెంతయు • దేజరిలుచు.

అరరే! దీనిసోయగము నెంతని కొనియాడగలను? ఈసుందరాంగిం గూడియుండువాడే ధన్యుడు. దీని పొందు మరిగినవాడింద్రభోగములనైన నాశింపడు. వేయేల!

తే॥ గీ॥ మిసిమి దవరారు యీకల్కి • మేనిదీప
సోకుటదెచాలు కనకాభి • షేకమురయ
నీజలజగంధికతివసజ్జోజయుగము
బట్టుటదె హేమశైల సంప్రాప్తమెన్న.

అబ్బా! ఇక నే నీయువతింగూడక నిలువజాల. సత్వరంబున సమీపించి నాయభీష్టంబు దెల్పెద. సమ్మతించిన సరి. లేదేని రాక్షసధర్మానుసారముగ బలాత్కరించెద.

(అని సీతను సమీపించు చున్నాడు.

సీత—(రావణుంజూచి) ఆహా! నేడెంతయు సుదినము. ఎవరో మహాత్ములేతెంచుచున్నారు (ప్రకాశముగ రావణునితో) మహాత్మా! వందనములు (నమస్కరించును)

రావ—కళ్యాణమస్తు దీర్ఘసుమంగలీభవ.

సీత—స్వామీ! ఇం దధిష్టింపుడు.

రావ—(కూర్చుండి) కళ్యాణీ! నే నిందెప్పుడును నిన్ను వీక్షించియుండ లేదు. ఇట్లొంటివై ఇందేల నివసించి యున్నదానవు? నీ వెవ్వరవు?

ఉ॥ మానసమం దొకింత యను • మానము భీతియు బూన కిట్టు లిం
దో నళినాక్షి యీయడవి • నొంటిగ బర్ణగృహాంతరంబున౯
బూనివసించె దంగనకు • బోలునె యీగతి నుండ నక్కటా!
దానవు లెవ్వరేః గనిన • దప్పక ముప్పు ఘటిల్లెడిం గదా!

నీకు తలిదండ్రులుగాని యన్నదమ్ములుగాని లేరా! నీభర్త యేమయ్యె? నీయుదంతమేమి?

సీత—మహాత్మా! సకల చరాచర ప్రాణికోటుల నెల్ల జల్లగ జూచుచు పాలింప బరమేశ్వరుండుండ నడవి నున్న నేమి పట్టణముననున్న నేమి! కాలవశమున రానున్న మంచిచెడ్డ లెట్లైన వచ్చునే కాని యూరకపోవు గదా?

రావ—మానినీ! నీధైర్యమునకే నచ్చెరువందితి. అందరిగాపాడువాడు దేవుడుండ నేమిభయమని తెలిసి తెలిసి యొకమహాపదం బడుట భావ్యమా? క్రూరజంతుశరణ్యంబైన యిమ్మహారణ్యంబున నీకే యాపద తటస్థించిన నెవరు సహాయము వత్తురు? ఏవియైన క్రూరమృగములు పైగవిసిన నబలవగు నీవేమి చేయగలవు? మరియు నీయరణ్యంబున ధూర్జటినైన లెక్కసేయని మహాబలులగు రాక్షసులనేకులు సంచరించుచుందురు. వారికి దయాశౌచములు సున్న. మరియును వినుము.

చ॥ అనవరతంబు శూరత బంధాంగనలన్ హరియించు కార్యమం
దనుపమ దక్షులై చెలగు • నట్టి నిశాచరు లెట్లొ నిన్నిటం
గనుగొని రేని మన్మథ వి • కారము బొంది బిరాన బల్మిమై
నినుగొని యేగ కుందురె? యంబిక హాయుడడ్డము వచ్చి నిచ్చినన్.

సీత — అయ్యా! తమరనుడివినట్లు దుష్టవర్తనులగు దానవులెంత ఘోర కృత్యమునకైన సాహసింతురు. ఇయ్యది సత్యమేయైనను,

తే॥ గీ॥ గ్రాహమును ద్రుంచి కరిఁగాచు • ఘనుడెవండొ
భక్తకోటుల రక్షించు • ప్రభుడెవండొ
ఆసమస్త జగన్నాథు • డబలనైన
పతితుక నొకర్తు నన్ను గాపాడలేడె?

సమస్తజగత్సంరక్షణ ధురాభరణ దక్షుండగు కమలాక్షునకు నేనుభారమా!

రావ — పడతీ! నీధర్మోక్తులం బట్టి చూడ నీ వల్పవంశసంజాతవుగాక యొకయసమాన సద్వంశమున మహాశూరుడగు వానికి బుట్టినట్లు తోచుచున్నావు. నీయనుపమాన సౌందర్యాతిశయముంబట్టిచూడ మర్త్యలోకాంగన భంగి దోపదు నీయందమానుష తేజము మూర్తీభవించినట్లున్నది. నీ వల జగన్మోహినివై యుందువేమో యని మనంబున శంక జనించెడిని. మఱియును,

తే॥ గీ॥ పడతి! నినుజూడ నాకరాజ • వనిత పగిది
నామదికిదోచెఁ జిన్నత • నంబునందు
జదువుకొనిన సాముద్రిక • శాస్త్రశక్తిఁ
గలికి! వనవాసమున కేమి • కారణంబు?

సీత — మహాత్మా! సర్వజ్ఞులగు మీకు తెలియని దెద్దికలదు? కాము వచించినట్లు నేను రాజవీరుండగు జనకునకు పుత్రినైనను దశరథ నరేంద్రునకు గోడలినైనను త్రిజగద్భయంకర పరాక్రమాభిరాముండగు రామునకు దారనైనను మహాసౌధముల నివసించుటకు మారుగ కాలవశంబున నిట్లు వల్కలాంబరముల

దాల్చి పర్ణగృహంబున నుండవలసె. ఎవ్వనికైన విధిలిఖిత మలంఘ్యముగదా!

రావ__ఎట్లు! నీవు రామునకు భార్యవా? సరిసరి తెలిసినది. అటులైన నీభర్త రాము డెందుచనె?

సీత__అయ్యా! యిందాక చక్కని లేడి నాకగుపడుటచే నేనద్దానితో వేడుకమీర నాడుకొనందలచి దానింబట్టుకొని తెచ్చి యిచ్చునట్లు ప్రార్థింప శరశరాసనముల దాల్చి నాథుండు లేడింగొని వచ్చుటకేగె.

రావ__మంచిది, తరువాతనేమైనది. నీనాథుం డాహరిణముం దెచ్చెనా?

సీత__మహాత్మా! వినుడు.

చ॥ వనమున కట్లు లేడిగొని • వచ్చెదనంచు వచించి సత్వరం
బున జని యెట్టి యాపదను • బొందెనొ తోచదు కాని, తమ్ముడా!
యను నొకగొప్ప యార్తరవ • మయ్యది నాథుని కంఠనాద మ
ట్లనుగతమయ్యె; గర్ణముల • నంతట నేను భయాకులాత్మనై.

క్రూరులగు దైత్యు లిందెప్పుడు జరించుచుందురు కావున వారి కెవరేమి హానిచేసిరో యని నేనువేడ నురిదియగు లక్ష్మణుండగ్రజునకు సహాయ మొనరింప నేగె. వారు శత్రువిజయముగాంచి తిరిగి వచ్చుచుందురు.

రా__వనితా! అన్నియు బాగుగనేయున్నవి. కాని నాకొకసందియము కలిగినది. దానిం దెలుపుమందువేని తెలుపుదు.

సీత__మహాత్మా! సందియమేటికి? వచింపుడు.

రావ__మానినీ! రాముడు లేడిందెచ్చుట కేగునప్పుడు లక్ష్మణుని నీ యొద్దనుంచి పోయినట్లు గదా చెప్పియుంటివి.

సీత__అయ్యా! ఔను లక్ష్మణుండు మొదట నిచ్చటనేయుండెను.

రావ__అటులైన నేనాధునిక కాలస్థితినిబట్టి యున్న యథార్థ మనుభవము వలన వచించుచున్నాడను. నీవలుగవలదు.

సీత__యథార్థమునకు కోపమేటికి?

రావ__వినుము. కాలమిప్పుడెంతయు మారిపోయినది. వావివరుసలు లేవు. జారత్వములు చోరత్వములు మెండు. పతివ్రతలరిది. ఎందు జూచినను కులటలే. పరీక్షించిచూచినను జితేంద్రియు డొక్కడైన నీసర్వజగంబున గానరాడు. అసత్యవాక్ధురీణులు వేనవేలు. సత్యము శశవిషాణము. ఇట్టికాలంబున;

చ॥ పొడగనినంత గామమును • బోవిడనాడిన మానినైన నా
వెడవిలుకాని పూడులికి • వ్రేటుల పాలొనరింపజాలు మేల్
పడతిని తమ్ముడంచు నొక • ప్రాయము వచ్చినవాని జెంగటన్
విడిచనె రాముడెంత యవి•వేకియొ, మత్తగజేంద్రగామినీ!

సీత__అయ్యా! మీ రాతని గుణాగుణము లెరుగనివారగుటచే నిట్లనుచున్నారు. నాకిందువలన గోపములేదు. లక్ష్మణుం డట్టివాడు కాడు. ఆయన నేమైననని బాపమువచ్చును.

రావ__చెలీ! ఏపుట్టలో నేపామున్నదియేమి తెలియును? లక్ష్మణుని పైకిజూచిన మంచివాడనుచుంటివి గాని వాని హృదయమెట్టిదో నీవెట్లు కనుగొనగలవు?

సీత__అయ్యా! చిన్నప్పటినుండియు జూచుచున్న దానను గాని, ఆయనయందిసుమంతయు దుర్గుణము జూడను.

రావ__వనితా! చిన్నప్పటినుండి యింతవరకును నీవాతనికి యొంటివై యెప్పుడు చిక్కియుంటివి? అట్టిసమయమునగదా వానిమనంబు గనుగొనుట. ఈనాడొంటిపాటున చిక్కినను తోడనే రామునకేదియో మూపదగలిగి తత్సమయమున కత డేగవలసివచ్చుటచే నీవు చిక్కుపడవైతివి. కాకున్న నిన్నాతడేమిచేసి యుండునో?

సీత__అయ్యా! ఇక మీరట్లు సెలవీజనదు. ఆయన జితేంద్రియుడు. నన్ననవరతంబును నమ్మాయనియు, దల్లీ, యనియు బిల్చుచుండును. ఇట్టివానిం దమరీవిధంబుగ నిందించుటతగదు.

రావ__తరుణి!

చ॥ విను మలనాడు సన్నుతవివేకధురాభరణప్రవీణతన్
జనులు నుతింప గీష్పతికి • జాలుచు సర్వకళావిదుండనన్
జను హరిణాంకుడన్ మదన • శాతశరార్తికి నోర్వ కాతురం
బున గురుదారఁ దారఁ గొని • పొందడె కామసుఖంబు మానినీ!

అతం డదివరకు గురువరుండగు బృహస్పతికి, తండ్రీ, యని యునాయనభార్య యగు తారను, తల్లీ, యనియేకదా పిలుచు చుండవచ్చును! అట్టివాడు మోహ మిగురొత్తినంతనె వివేకము నుదోసి వావివరుసలదీసి, తల్లీయని తా నదివర కెవరిం బిల్చు చుండెనో అట్టితారను నిజదారగా గ్రహించి కామకేళిం గూడడా? అంతకన్న నీలక్ష్మణుం డెక్కువా యేమి? ఇదిగో తుది వాక్యము నుడువుచున్నాడను.

ఉ॥ ఇంతవచింప నేల విను • మిత్తుశరాసనమధ్య! శుంభద
త్యంత నిశాతహేతి సమ • దారుణ పుష్పశిలీముఖంబులన్
కంతుడు రువ్వసాగిన జగాన నెవండును తాళజాల డీ
వంతున ధాత్రిఁ జాటగను • వచ్చు విలోలమదాళికుంతలా!

సీత—(అసహ్యముతో) అయ్యో! మీవాక్యములు బొత్తుగానమ్మరానివి. లోకమున జితేంద్రియులే లేరనియు నందరు గామాంధులేయనియు నెల్లరు గులటలేయనియు దమయభిప్రాయము గాబోలు. అట్లెన్నటికింగాదు పురుషులలో గొందరు జితేంద్రియులును బరసతీ పరాఙ్ముఖులును గలరు. స్త్రీలలోగూడ బతివ్రతావతల్లు లెందరెందరో కలరు

రావ—పడతీ! ఇంకను నీకునామాటలయందు నమ్మకము చిక్కకున్నది. ఇదిగో తెలియజెప్పెదవినుము. పురుషుని జితేంద్రియత్వమును బరనారీపరాఙ్ముఖత్వమును జక్కని సుందరాంగి పైబడవచ్చు వరకును, నాఁడుదానిపాతివ్రత్యము పట్టుబట్టిన విడువనిపురుషుండు బలాత్కరించువరకును నిలుచునేకాని యాపైని నిల్చునవికావని నేను దృఢముగా వ్రాయిగుద్ది యెందరియెదుటనైనను వాదింపగలను. ఇంతయేల? వినుము.

మ॥ అనఘుం డీశ్వరపాదపంకరుహయు • గ్మారాధినై వాయుభ
క్షణముం జేసెదు నాకు చెప్పుటకు సి • గ్గౌ నైన వాంఛింపదు నిం
తనరానట్టి మనోజవేదనము చి • త్తంబందునం దోచఁగ
గ్గై నవ యౌవనరాజితుండొకడు కౌ • గిలింపెందుటల్ చిత్రమే?

నీవు నాకెంతయు బ్రియురాలవగుటచే నీరహస్యము వెలి బుచ్చితి. దీనినెచ్చటను వెల్లడిచేయదగదు సుమీ!

సీత—(కించిత్కోపసూచకముగ) ఆర్యా! నేడిదియేమి తమరిట్లనరాని పాప వాక్యము లాడుచున్నారు? ఇది ఏమైన భగవన్నామమా? లేక ముక్తిప్రదమా! కామాంధులగువారికిది తగుగాని తపోధనులగు మీకిట్టి ప్రసంగములతో నేమిపని? ఇదియెంతైన సరియగు త్రోవయా? దీన నిహమా; పరమా? తెల్పుడు. సర్వజ్ఞులగు మీకు నే జెప్పవలయునా?

రావ—(కోపముతో లేచి)

శా॥ ఏమే మెట్టెటు లేమిపల్కితివి? నా • యీ సత్ప్రసంగంబులన్
కామాంధుల్ వచియించు మాటలనియా? • కానిమ్మ దే చూడు మి
ష్టే మన్నిష్ఠుర శాపపావకమహా • భీమార్చులన్ మిమ్ములన్
భూమింగూల్చిన నెవ్వడడ్డమయి మి • మ్ముం గాచునో చూచెదన్

సీత—(భయవిహ్వలయై) మహాత్మా! శాంతింపవలయు. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము విడుచుట పాడిగాదు. స్వామీ! మహాతపోధనులగు మీ రాగ్రహము వహింప మశకమాత్రులమగు మేము సమీపింపగలమా?

రావణు—అది యెఱిగియు నిట్లు నిర్భయముగా నావాక్యముల కెదురాడుట నీకుం దగదు. అయిన నబలవగు నీపైనలిగి శపించిన మాకేమి లాభము వచ్చును? ప్రథమ దోషము సైరించి నాడను. ఇకముందెప్పుడును మముబోటివారితో నిట్లు ప్రసంగింపకుము.

సీత—ఆర్యా! మీకరుణాదృష్టి కిప్పుడు మేము ధన్యులమైతిమి.

రావ—వనితా! నీకిదివరకెప్పుడు మాబోటి మహాత్ముల దర్శించి వారితో బ్రసంగించి యెరుంగాన వగుటచే నిప్పుడు క్షమార్హవైతివి. మరియొకసంగతి చెప్పెదను.

చ॥ తరళసరోజనేత్రి! విను • తథ్యము క్రూరనిశాటు లెందరెం
దరో చరియించుచుండెద రనారత మివ్వనమందు వారు దు
ర్భర కపట క్రియాచతుల • వాగురలం దవిలించి మించి యా
హరిహర పద్మసంభవులకైన వడంకగ జేతు రుగ్మలీ!

కావున నీవబలవు, వారిచే నీకేదైన నాపద మూడెనేని పిమ్మట చేయునది లేదు. మాయాశ్రమ మిచటి కనతిదూరంబు ననే కలదు. నిన్నిప్పుడచటికి దీసికొని పోదును. నీనాథుండువచ్చిన వెనుక మరల నిన్ను మాశిష్యులిచటికి దీసికొని వచ్చి విడిచి పోదురు. లెమ్ము పోవుదము, శంకింపకుము. నేబెరవాడగాను.

సీత—అయ్యా! మిమ్ముల నే బెరవారిగ దలపను. మదీయజనకుం డగు జనకుండెట్టులో మిమ్మట్లుగ భావించుచున్నదానను. నాథుడు వచ్చువరకు నేనిచటినుండి బయలుదేరజాలను. క్షమింపవేడెదను మీరన్యథా తలపవలదు.

రావ—పోనిమ్ము నీకంత యనుమానముగనున్న నిప్పుడు నేనేటికి బలవంత పరుపవలయును? నీయిష్టము వచ్చినట్లు కానిమ్ము (ఆకాశమువంక జూచి) ఓహో! నేను వచ్చి కాలమైనది. ప్రసంగవశమున బర్ణశాలను మరచితి. మానినీ!

తే॥ గీ॥ ఎంతో తడవయ్యె నేనిట • కేగుదెంచి
[illegible] శిష్యులేరీతి • నున్నవారొ
జూడనేయు [illegible] మున • నేగ [illegible]
పడతి! భిక్షనొసంగి నన్ • బంపుమింక.

సీత—(తనలో) ఇప్పుడీయన కేమిభిక్షనొసంగుదును? రాజ్యభ్రష్టులమై యున్న మాకడ గందమూలాదులుతప్ప మరేమియునుండవని యీయనకుమాత్రము తెలియదా? ఏతత్సమయమున సిద్ధముగ నున్న యీవన్యపదార్థములే భిక్షనొసంగెద (కందమూలాదుల

దీనికొఱకని ప్రకాశముగా) మహాత్మా! వర్తమానమున మేమెట్టి పదవియందుంటిమో, మీరెరిగియెయున్నవారలు. పరమేశ్వరు డొసంగిన యీపదార్థముల గ్రహించి మమ్ముల కృతార్థుల గావింపుడు (అని కందమూలాదుల నీయఁబోవుచున్నది.)

రావ—(నిరసించి) వనితా! నేనీభిక్షుకై వచ్చినాడగాను సుమీ!

సీత—అయ్యా! రాజ్యవిహీనులమై వన వాసమొనరించుచున్న మా కడ నింతకన్న నధికపదార్థము లేమిగలవు. ప్రస్తుత మివిగ్రహించి మమ్ముల రక్షింపుడు.

రావ—మానినీ! ఏమంటివి? రాజ్యవిహీనులమనియా? వినుము,

తే॥ గీ॥ జలజలోచన! "రాజ్యహీనుల" మటంచు
పలికెదేటికి? రాజ్యంబు • వలదునాకు
పడియుంటివి స్వల్పమా • భిక్షయొకటి
చాలు నది యొసగిన నాకు • చంద్రవదన.

సీత—మహాత్మా! మాకడలేనిపదార్థముల నెట్లుమీకొసఁగఁగ దానను;

రావ—నేను మీకడ లేనిపదార్థము గోరియుండలేదుగదా?

సీత—అట్లైన మాకడ నింతకన్న నింకేమిగలవు? స్వామీ!

రావ—ఇంతకన్న నేమియు లేవా! ఉన్నవానియందొకదానిని వాంఛింతును. నీవది నాకొసంగి పంపివేయుము.

సీత—అయ్యా! అదియేదియో తెలుపుడు.

రావ—గట్టిగ దెలుపుమందువా? తెలిపినపిమ్మట లేదనవుగదా!

సీత—మీకింత సందేహమేటికి? మాయొద్దగల పదార్థములయందు తన రుదేనిని నాంక్షించియున్నారో దానిఁగొనిపొండు.

రావ—కలువకంటీ! నాకు కడుఁగడుసంతసమయ్యె. ముమ్మాటికి నేను కోరినది యొసఁగెదవుగదా,

సీత—(తనలో) ఈయన దేనినికోరునో తెలియదు మాకడ నింకగల పదార్థము లెవ్వి? నన్నింతగట్టిగ నిర్బంధించి యడుగుట కేమి కారణమైయుండును? వీని హృదయము వేరైయుండదుకదా!

రావ___ఏమి సందేహించెదవేటికి?

సీత___అయ్యా! సందేహమేమియు లేదు. మీరు దేనిం గోరియుంటిరో తెలియజేయుడు.

రావ___చెలీ! నీవు గట్టిగ జెప్పుమంటివి. కావున నిదిగో వచియించుచున్నాడను! చెప్పిన పిదప నాయభీష్టము దీర్పవేని నీకఘము వాటిల్లును.

శా॥ బాలా! తెల్పెద నాలకింపు మిదె దా • పక్ష లాభమేమింక, నీ
దౌలావణ్యము, నీ యొయారమును నీ • యందంబు చందంబు నే
డాలోకించి విరాళిజెందితి నిదే • లా జాగుసేయంగ న
న్నోలిన్ నీబిగి కౌఁగిటం దనుపు మిం • దో రాజబింబాననా!

నేను వాంఛించినది నీయధరామృత భిక్ష. నాకయ్యది తప్పక ప్రసాదింపవలయును. లేకున్న నీకనృతదోషంబు వచ్చును.

సీత___(చెవులు మూసికొని)

చ॥ హరహర యెట్టిమాట వినఁ • నయ్యె మునీశ్వరులైన మీకు నీ
దురితపుఁ జింత చెల్లునె? బు • ధుల్ గని మెత్తురె? కాలకింకరుల్
పరసతిఁ గోరువాని పటు • బాధలఁ బెట్టెదరంచు వల్కు స
త్పురుషుల వాక్యముల్ వినరె • పోలునె మానుల కిట్టులాడగన్

భగవదారాధనాది సత్కార్యములనుండి తొలగి పరాంగనలపైఁ జనిన మీయింద్రియాశ్వముల మరలించుకొనుడు. మానులగు మీకిట్టి దుర్నీతి తగదు.

రావ___ఏమంటివి! మానులైన మోహముండదా? ఇది యెంతైనసరియగు మాటయా? నేనువాంఛించిన పదార్థమొసగుదునని నీవిప్పుడిట్లు పలుకుట న్యాయమా?

సీత___అయ్యా! తెలిసినవారలగు మీరలే యిట్టిపాపకార్యమునకు సాహసింప నిక లోకము నిట్టిదుష్కార్యములకు వెరచువారెవరుందురు? ఇకనైన నీదుశ్చింత మానుము.

రావ___చెలియా! నన్నిప్పుడు నిష్ఫలమనోరథుం జేయకుము. నీవేమన్నను నినుగూడక నిలువజాల. జాలమేలచేసెదవు? నాయభీష్టంబు దీర్పుము.

సీత—(కించిత్కోపముతో) అంతకంతకు నీదుష్ప్రసంగము లధికమగు
చున్నవి. జాగ్రత. బుద్ధిదెచ్చుకొని మాయాశ్రమమునుండి
తొలగిపొమ్ము.

రావ—అతివా! ఇంతకఠినమూనజెల్లునా? నీవన్నట్లు మాయాశ్రమము
వదలిపోయెద గాని నేగోరినభిక్ష నొసంగుము. ఆలస్యమేటికి!

సీత—ఓరీ కామాంధుడా! నీకు కన్నులు నెత్తికెక్కినవాయేమి! ఇంకను
నిదేతీరున బ్రేలుచుంటివేని శ్రీరామశరాగ్నిం దప్పక కూలెదవు
సుమీ?

రావ—(నవ్వి) సుందరాంగీ! ఏమినీమాటలు! చూచుటకు వృద్ధుండనై
యుంటినని యారాముని జెప్పి నన్ను భయపెట్టుచుంటివి, వినుము.

తే॥ గీ॥ గరుడ గంధర్వ కిన్నర • గణములెల్ల
నెవనిపేర్విన్న మాత్రాన • జవమువీడి
గడగడ వడంకుచుందు రా • ఘనున కొక్క
మనుజమాత్రుడసాధ్యుడే • వనజనేత్ర!

సీత—ఓరీ! నిన్నుంజూడ సన్యాసివలె దోపవు. మదాంధుండవై పరాం
గనల మోసపుచ్చు నిట్టి కపటవేషధారివై చరియించు దుష్టుండ
వని మాటలంబట్టి తెలియుచున్నది; దుష్టదానవ విరాముండగు
రాముండు నిన్నుం జూచెనేని ప్రాణములతో విడువడు.
ఏల నీకీదుశ్చింత? తొలగిపొమ్ము.

రావ—చెలీ! నీవన్నట్లు నేను కపటవేషధారుండనే గాని సన్యాసిం
గాను. కడుంగడు చతురవగుటచే నీవు కనుగొంటివి. ఇంతటి
జాణవగు నీవు పిరికిపందయు హీనుండునునగు రాము నెట్లు చేప
ట్టితివో తెలియదు. నీ రసికతకు నీనెరనీటునకు నీయందమునకు,
నీచందమునకు నవివేకియు నబలుండునునగు రాముడు తగడు.
అవివేకి కాకున్న రతీసతింబోలు నిన్నిట్లు కానలం ద్రిప్పునా!
పడతీ! నీయీదుర్దశం జూచిన నాకెట్టులో యున్నది ఏమన,

మ॥ దళమా వెన్నెలం గందు కోమల•లతా తన్వంగి నీవక్కటా
చెలియా! పొట్టకు కూడులేని మనుజు•జేపట్టి ఘోరాటవిన్.

పలుచందంబుల గష్టమొందుటను కన్నన్ నా కెచిత్తంబునన్
గలుగం జొచ్చెడి జింత, నీవెటుల దుఃఖంబొందుచుండోగదే!

సీత—పరమేశ్వరు డెవనికే యే కష్టసుఖములు విధించెనో యవి తప్పక యనుభవనీయములు. మాకష్టములతో నీకేమిపని? మే మరణ్యమందుండుదుమో లేక పట్టణమునం దుండుదుమో యది యంతయు నీకేల? నీదారిని నీవు పొమ్ము. తడవు మసలితివేని తప్పక ముప్పువాటిల్లును.

రావ—ముప్పువాటిల్లు నెవరికి? ఎవరివలన?

సీత—నీకు, రామునివలన.

రావ—ఆఁ! ఏమి! రామునివలననే, నాకే. ఇది కలనైనను జరుగదు, పడతీ! ఒకమాట చెప్పెదను, సహజసుకుమార శరీరవగు నీవి ట్లడవి నిడుములం గుడువ నేటికి?

సీ॥ పట్టుపుట్టములఁ దా • ల్పగరాదె మెయినిండ,
గలికి, మాసినచీర • గట్టనేల?
భూరి సౌధాంతరం • బుల వసింపగరాదె
యువిద! యిట్లడవిని • యుండనేల?
సలలితరుచ్యాన్న • ముల భుజింపగరాదె
చెలి యుపవాసముల్ • సేయనేల?
అతికోమలంపు శ • య్యల సుఖింపగరాదె
పడతి కర్కశ ధాత్రిఁ • బండనేల

తే॥ గీ॥ ఉభయపార్శ్వములందున • నూడిగంపు
జెలులు కనుసన్న మెలఁగుచు • సేవజేయ
బట్టపుందేవివై నాకు • వరలరాదె
యతివ! యీగతి నడవి న • ల్గాడ నేల?

సీత—ఓరీ! కపటశీలా! నీదుష్ప్రసంగంబు లింక గట్టిపెట్టుము. తుచ్ఛములగు నీలాటి సౌఖ్యములం జెప్పి భ్రమింపజేయఁ దలచితివి కాబోలు. చాలును లెమ్ము మా! నెలవుం బాసిపొమ్ము.

రావ — లతాంగీ! నీవిట్లనిన నే నేమందును! నీ సౌఖ్యముకొఱకు నేనె న్నియో చెప్పుచున్నను నీవు వినకున్న దానవు. నీ యీహీనదశం జూచినప్పటినుండియు నాకు నీపై నెంతయు జాలి వొడముటచే నిట్లంటిని, నన్ను సామాన్యునిగ నెంచకుము.

సీ॥ కట్టించినాఁడ సం • గ్రామరంగమునందు
భటులచే శాత్రవ • వ్రజము నెల్ల
ధట్టించినాఁడ ను • ద్యల్లీల నార్జించి
ఘనయశస్ఫూర్తి దిక్ • తటములందు
కొట్టించినాఁడ ను • గ్గుర మూర్ధన్యులచే
గరుడ గంధర్వ కి • న్నరులబట్టి
పెట్టించినాఁడ దే • వేంద్రాది దిక్పాల
సమితి నుగ్రతఁ జెర • సాలలందు

తే॥ గీ॥ నిట్టి బాహుబలాఢ్యుఁ • డన్న నేను
పోఁజాలునె నీకును • డో లతాంగి!
తలఁపఁ జూడంగ నన్నుఁ బ్రా • చలము నైన
నిట్టి వరుఁగాదనుచుఁ దివ • నేమిఫలము

సీత — ఓరి! కామాంధుఁడా! త్రిజగత్ప్రఖ్యాతచారిత్రుండగు శ్రీరాముని కన్నుగానక సామాన్యునిగ దలంచి దూషించుచున్నాఁడవు. నీవింతకు నగినఫల మనుభవించెదవు శ్రీరాముని దానవకంఠ లుంఠనకళానిపుణుండని యెఱుంగుము. నీ వమ్మహాత్ముని శతాంశమునకైన రాజవు

రావ — మానినీ! నాపరాక్రమ మింకను నీకు దెలియలేదు నన్నొక సామాన్యునిగ దలంచుచుంటివి కాబోలు. అసమ సమరాంగణ వినిర్జిత సురేశ్వరుండగు దశాస్యునిగ నన్నెఱుంగుము.

మ॥ కనదంభోజదళాయతాక్షి! వినుమిం • కన్ దాపగా నేల నా
యనుగుం జెల్లెలు హెచ్చులు నీ • యాకార మాలించి సం
జనితాత్యంత మనోజవేదనుఁడనై • సారంగమున్ మాయ పెం
పునఁ బుట్టించి నినున్ వెసన్ బలిమిఁ గొం • పోవంగ నేతెంచితిన్.

సీత—హా! దుష్టుడా! ఎంత మోసము చేసితివిరా (దుఃఖముతో) దైవమా! ఇంకేమిచేయుదును? కుటిలుండగు నీదానవుండు నన్నుం గొనిపోవనెంచెగదా! అయ్యో! నాకిపుడు దిక్కెవ్వరు? హా! మనోనాథా! నీ ప్రియసతి నొక దుష్టుండు చెరుపనున్నవాడు. సత్వరంబున నేతెంచి రక్షింపుము! ఓ యనాథశరణ్యా! జగన్నాథా! భక్తరక్షణపరాయణా! నారాయణా! కుజనశిక్షా! సాధురక్షా! కమలాక్షా!

శా॥ నీతింబోవిడనాడి యీ యడవి నొంటిన్ నన్ను గామాంధుడై
రాతింబోలిన చిత్తవృత్తిగల దుర్మార్గుం డొకండిందు నా
పాతివ్రత్య మడంచి నన్ను హరియింపన్ జూచుచున్నాడహో
దైతేయాంతక! కావవే, యబలనీ దైత్యాధముం ద్రుంపవే.

రావ—సీతా! ఊరడిల్లు మూరడిల్లుము. ఏల దుఃఖించెదవు? నీకే మాత్రమును భయములేదు. నే బెరవాడగాను. చతుర్దశ భువనము లొక్కటియై వచ్చినను నీ కేయాపదయును రానీయను. నను వరింతువేని నీజనకునకు బహుమానముగ నీధరామండలంబంతయు బట్టముగట్టెదను. నిన్ను లంకానగరంబునకు రాజ్ఞిగ నొనరించెదను. నా సమస్తభార్యలచే నీకు వలయు సేవల జేయించెదను. మూడులోకంబులును నీయాజ్ఞకు లోనైయుండునట్లు కావించెదను. వేయేల? చతుర్దశభువనశాసనుండనగు నేనే నీకు నాథుండనై యుండ నింక నీ కేకొదువకలదు? సందేహము వీడుము. లంకానగరంబునకు బోవుదము లెమ్ము. మరియు వినుము.

మ॥ కలకంఠుల్ కడుభక్తిమీర నిరువంకన్ నిల్చి వింజామరల్
చెలువొప్పారగ వీచుచుండగ శచీసీమంతినిన్ మీరుచున్
లలితాష్టాపద వజ్రదంతురిత డోలాభ్యంతరంబందు నో
యళినీలాలక! పొందెదీ వఖిల సౌఖ్యంబుల్ ప్రమోదంబుగన్.

సీత—(తనలో) అయ్యో! నేనిప్పుడెందు జొత్తును? ఈ దుష్టుండు నన్ను విడుచునట్లు తోచదు. నాశక్తికొలది ప్రయత్నించెదగాక. (ప్రకాశముగా) ఓరీ నిశాచరా! పాపహేతువగు దుః

దుష్కార్యమున కేల సాహసించెదవు? రాముఁడిది యెఱింగిన నీయసురు దీయకమానడు. చెడిపోక సత్పథానువర్తివికమ్ము.

రావ—హంసగమనా! నీవెన్ని చెప్పినను నీపైఁగల విరాళిని విడువజాల కున్నాడను. నామాటల బెడచెవిం బెట్టకుము. నీవిందుండి యను భవించు సౌఖ్యమేమి? కనుల జూతమన్నను రుచ్యములగునాహా రములు లేక చక్కని పూలపాన్పుల వర్జించి సర్వసౌఖ్యంబులకు దూరమై పాడుపాతివ్రత్యమున కేలయాసజెందెదవు? అహల్యా తారలకన్న నీవధికురాలవా! తగినవరుండు లేకున్న దరుణి పర పురుషుం గూడుటయు, దగినభార్య లేనప్పుడు పురుషుడు పరాంగనం గోరుటయు యుక్తమే. దుర్బలుండగు రాముండు నవయౌవనాంగివగు నీకుం దగడు. కావున నతిపరాక్రమవిరాజి తుండనగు నన్ను గ్రహించుట తప్పుకాదు.

సీత—ఓరీమోహాంధుఁడా! అతి చంచలంబులును నస్థిరంబులును నగు సౌఖ్యంబులను శాశ్వతములని తలంచి పొగరున గన్నుగానక తనకంటె నధికులులేరని తలంచి మహాగర్వమున విఱ్ఱవీగు నీబోటి మదాంధు లిట్టిసౌఖ్యములయం దత్యభిలాషబూని పాప కార్యముల జేయగడంగుదురు గాని ప్రాజ్ఞుల మత మయ్యది కాదు. ఓరాత్రించరా! సాధ్వీమతల్లులకు,

సీ॥ శితకంటకావృత • సీమయె యగుగాక
స్ఫాటిక కుట్టిమ • స్థలసమంబు
అతిభయప్రదమైన • యటవియే యగుగాక
తతరమ్య నంద నోద్యాన మరయ
సామాన్యమగు పర్ణ • శాలయే యగుగాక
యిమ్మైన వైజయం • తమ్ము సుమ్ము
కోమలత్వము లేని • భూమియె యగుగాక
అమిత భోగదమైన • యలరుపాన్పు

తే॥ గీ॥ విష్ణుసముఁడగు నాథు నే • వేళయందుఁ
బాయకుండెన; నవునేడ • బాసియున్న





సకలసౌఖ్య ప్రదంబయి • యలరు స్వర్గ
నగరమైనను ఘోరమౌ • నరకమెన్న.

రావ—కాంతా! నీయంటిదానిని నేనెందును జూడలేదు! అబ్బబ్బా. ఎంతకఠిన హృదయవు! చతుర్దశభువనంబులయందును నాకువశులు గానివారు లేరు. అంతటివాడ నగు నేను స్వయముగా నేతెంచి కోరుచుండ నిరాకరించుట నీకిరా మోకా లొడ్డిన ట్లున్నది.

సీత—ఓరీ! ఇక నధికప్రసంగములతో బనిలేదు. సత్వరమ మాయాశ్రమముం బాసిపొమ్ము!

రావ—సఖీ! నన్నేటి కలయించెదవు? నీపివమపరీక్ష నింక చాలించి మదనజ్వరక్రాంగుండనగు నన్ను కటాక్షింపుము. తడవుచేసిన నికనిలువజాల.

సీత—జడమతీ!

ఉ॥ వెంగలివై వివేకమును • వీడి మదోన్నతిచే బరాంగనా
సంగము గోరుచుంటివి నిశాచర! ముక్ పరదార గోరుటక్
భంగము నొందడే విబుధ • నాయకు డాగని నాత్మనెంచి స్ౌ
నం గలుషాత్మ! మానుము మ • నంబున నీచెడు చింతదుర్మతీ!

రావ—మానినీ! ఏమంటివి? దేవేంద్రునకు పరదారంగూడుటచే భంగమువాటిల్లెననియా? సరే. ఇదియుక్తమే. పెద్దగాలికి గొట్టుకొనిపోవు దుర్బలులగు మునిముచ్చులకు గూడ వెరచు భీరుస్వభావుండగుటచే నత డట్లు భంగపడియెం. నిం దాశ్చర్య మేమి కలదు?

సీత—నీకుగూడ నటులే భంగము వాటిల్లును నామాట వినుము.

రావ—తరుణీ! యెంత వెర్రిదానవు! కుక్కుటమాత్రుండగు నాసహస్రనేత్రునకు పరాభవము కలిగెనని చతుర్దశభువన విద్రావణుండగు నీ రావణునకు పరాభవముకలుగునా? కలనైననట్లు జరుగుటరుదు. ఏల నన్ను భయపెట్టెదవు? నీయాశ్లేషసౌఖ్య మొసగి నన్ను రక్షింపుము. లేకున్న బలిమినైన నిన్ను గొంపోక విడువజాల.

సీత—ఓరీ! వెకలీ! సాహసము మానుము. నావాక్యముల చెవిఁజెవిం బెట్టకుము

తే॥ గీ॥ అస్థిరంబగు కామసౌ • ఖ్యార్థమిట్లు
నీచకార్యంబు నిర్భీతి • నాచరించి
సంతత స్థిర పరలోక • సౌఖ్యములకు
దూరమైపోవ నేటికో • దుష్ట! వినర

రావ—కోమలాంగీ! ఎన్ని సౌఖ్యములకు దూరుండనైన నగుదుగాక. నినుగూడి కామోపభోగంబు ననుభవింపక తాళజాలను నన్నేల గాసిలజేసెదవు? కసికిరము వహింపుము

సీత—ఓరీ! మదాంధుడా! నీకండకావర మేటికి? సౌఖ్యముగ గొన్నినాళ్లు భూమిం బ్రతుక నెంచితివేని వచ్చినత్రోవం బొమ్ము. నాథుండు వచ్చునందాక యిక్కడ పేలుచుంటివేని నీవు సబాంధవముగ నెందు డాగినను హతుండవు కాక మానవు

రావ—ఏమి! తమ్ముఁడు - జ్య వపహరింప నవాధపగిరి గానకు వచ్చి నరమానవుఁడు వెరచి డాగవలయుఁగా! నాసామర్థ్యంబు నీవెఱుంగవు కాఁబోలు, జెప్పెద వినుము—

సీత—ఓరీ రాత్రించరాధమా! చతుర్దశభువన జేగీయమాన మహాపరాక్రమాభిరాములును త్రిజగద్భయదఘోర బాణాసన నిర్ముక్త కఠోర శరసార నిర్మగ్న శాత్రవప్రకరులును నగు శ్రీరామలక్ష్మణుల యెదుట మశకమాత్రులగు నీబోంట్లు వేయిమంది రావణులైనను నిలువంజాలరు. నీప్రలాపంబు వేరె చెప్పనేల? తొలంగిపొమ్ము. పరధనపరనారీహరులు మహారౌరవాది నరకబాధల ననుభవింతురని యెఱింగించు ప్రాజ్ఞుల సూక్తులం దలంపుము

రావ—పడతీ! నీవు పలికిన వాక్యములు ప్రాజ్ఞులవి కావు.

చ॥ మును బలహీనులౌ మనుజ • బోటులు మన్మథసంగరంబునం
దనుపగ శక్తిలేక, తమ • దారల నన్యులు గోరకుండ వ్రా
సిన వచనంబులం గొఱికి • జేడియ నట్లు భయపెట్టెదేటికే?
వనజదళాక్షి! యిట్లుగను • వాడిమొనల్ త్రిభయంబెట్టెదేటికే!

సీత—రోగికి పథ్యమరుచింపనట్లు చావసిద్ధముగనున్న నీకు నాహితాలాపములు రుచింపకపోగ మీదుమిక్కిలి నీతిప్రబోధకులును ప్రాజ్ఞులునునగు మహాత్ములను గూడ నిందించుచున్నాడవు. నీ విహలోకమున శిక్షితుండవగుటయేగాక పరలోకమునగూడ తప్పక దండనార్హుండవు కాగలవు? నా వాక్యముల నమ్ముము. చెడిపోవనేటికి? పరనారీసంగమవాంఛ మహా పాపకారణము.

రావ—చెలీ, అందరికి పాపకారణమైన నగుగాక, రాక్షసులమగు మాకు పరధనాపహారణంబును, పరులదండించుటయు, నన్నిటికంటె బరనారీహరణంబును నతిశ్రేయస్కరము. మాకివియే కులధర్మములు మేము వీని నిసుమంతయు దప్పుగ గణింపము. ప్రాజ్ఞుల నిందించితివంటివి. ఒక్క ప్రాజ్ఞులను నిందించుటయే కాదు, మహామునులఁ గూడ బంధించి చెరబెట్టి వారిదారల బలాత్కరించుటయు నాదిగాగల మహాకార్యములు మాకు గరతలామలకములు ఇకనేల సంశయింతువు రమ్ము కౌగిలిమ్ము, లంకాపురికేగుదము లెమ్ము

(అని సీతను సమీపించబోవుచున్నాడు).

సీత—(వెనుకకుజరిగి) ఛీ దుష్టుడా! దూరముగ నుండుము పరనారీహరణంబన్న మహాదురితమని యెఱుంగవా? అందు శ్రీరాము పత్నిం గొనదలంచుటన్న నిప్పులాడిగట్టుటయే సుమీ! జాగ్రత! పరాంగనాపహారణంబును సామాన్యముగ దలంచితివి కాబోలు, వినుము

సీ॥ రౌరవాద్యతి భీకరఘోర నరకసం
స్థానీకమునకు సో • పానపంక్తి
బహుళ సత్కార్యసం • పాదితానఘకీర్తి
ఘనచంద్రికాగ్రీష్మ • వాసరార్చి
దురితకారణమైన • దుర్యశః పుటభేద
నంబున కతుల ఘం • టాపథంబు
సుస్థిరపుణ్యలో • క స్థానమునకు దు
రవలోక్య దుర్గమా • రణ్యసరణి

తే॥ గీ॥ నారిజనములు నిందింప • గారణంబు
వనఘసుకృతాంబుధికి బడ • బానలంబు
స్వకుల వనవాటికరుదయేటి • వహ్నికీల
పరసతీహరణం బోరి • పరమనీచ!

రావ—బాలా! నన్నేల జాలిందూలజేసెదవు? నీకటాక్ష హిమాంబువుల నాపై జిలికినంగాని నాయీమదనతాప మారదు. ఏదీ! ఒకతూరి నను నీక్రీగంటజూడుము నాపై నలుకవీడుము.

సీత—నిశాచరాధమా! శ్రీరామ శరాంబువులు కురిసి నీపరితాపానలంబు నార్పగలవు. త్వరపడకుము.

రావ—చంద్రవదనా! నన్నేటికలయించెదవు? అదే మదనుం, డిదేయదనని నాపై బూవుటంపర గురిపింపసాగె. భీతి నెషద దడదడలాడెడిని. నన్ను నీకౌగిటగారవించి భయంబుడుపుము, నీపాలంబడితి.

సీత—జడుడా! కొంచెముండుము. లక్ష్మణుండు నిజధనుర్ముక్త శరలతికతుం జేసినిన్ను గారవింపగలడు నీభయంబప్పు డుడుగగలదు.

రావ—(కోపముతో) కఠినాత్మురాలా! ఆడుదానవని నేనెంత నిదానించియున్నను, నీవాచాలత్వ మధికమగుచున్నది, కాని తగ్గుటలేదు. సకలదేవతానీకముల నెట్టిగొన్న మదీయ బలపరాక్రమములు నీముందెందుకును గొరగాకున్నవి. ఇదిగో, గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష, యక్ష, సిద్ధ, సాధ్య ప్రముఖ, మహాభయప్రదంబగు నస్మదీయ నిజాకారంబుదాల్చి నినుంగొని—(అని యిరువదిహస్తములు, పదిశిరంబులును గల తనయాకృతింజూపుచున్నాడు).

సీత—హా! (అని మూర్ఛిల్లుచున్నది.)

(యవనికజారును)





శ్రీ

# సీతారామవియోగము.

## పంచమాంకము.

(సీతను రథముపైనుంచుకొని గగనమార్గమున బోవుచు)
రావణుడు ప్రవేశించుచున్నాడు

రావ—(తనలో) బళే! నేనిప్పుడెంతయు ధన్యుండనైతి. సోదరులిరువురియం దొకండును లేకుండుటచే ననాయాసంబుగ నీయువతిం గొనితేగల్గితి! ఒక్కరైన బర్ణశాలయందుండినచో నాకు గొంత శ్రమకలిగియేయుండును. ఇంతకు నాయదృష్టము బాగుండుటచే నెవరికంట బడకుండ నభీష్టప్రాప్తి గాంచితి. (వెనుకకు దిరిగి చూచి) నేనిప్పటికి చాలదూరమువచ్చితి. నాకింక వాగస్త్రము రాజాలదు (మూర్ఛిల్లిపడియున్న సీతంజూచి) ఇంకను నిత్తరుణికి మూర్ఛ తెలియనట్లున్నది. కానిమ్ము లంకం జేరునంతకు నుండిన నాపైన విచారింపవచ్చు. ఇప్పుడే మూర్ఛదెలిసిన నదియు గొంతశ్రమకు కారణమె.

సీత—(కొంచెము కదలుచున్నది)

రావ—అదే కదలుచున్నది. మెలకువ కలుగలేదుకదా! సత్వరముగ రథంబు బోనిచ్చెదగాక.

సీత—(మేల్కని లేచి దిక్కులు పరికించి దుఃఖముతో) హా! దుష్టుడా! ఎంతమోసము జేసితివిరా! అయ్యయ్యో! నేనింకేమి సేయుదును! హా! నాథా! నీప్రియపత్ని నేడెట్టి మహాపాతకకరంబున గొట్టుకొనిపోవుచున్నదో వీక్షింపుము.

చ॥ కరుణదయానిధీ! వరవిభాకరవంశ సుధాబ్ధిచంద్ర! నే
నరుగుచునుంటి నేఁడొక నిశాటునిచేఁబడి దిక్కుమాలి, న
త్వరగతిరాగదే కఠిన • బాణపరంపర నీనిశాచరున్
ధరణినిఁ గూల్పవే రయము • నన్ గొనిపోఁగదె నన్ మనోహరా!

రావ___(తనలో) అదిగో సీత! మేలుకొనినది? కానిమ్ము, దీనిరోదనం బెవరువిందురు? దీనికడ్డమెవరువత్తురు? అయినను గొంచెము దుఃఖోపశమనంబు జేయ ప్రియత్నింతును. (ప్రకాశముగ) సీతా! ఊరడిల్లు మూరడిల్లుము ఏలదుఃఖించెదవు? నీకేమియు భయము లేదు. నేనన్యుండగాను.

సీత___ఓరీ! పాపకర్ముడా! ఎంతటి సాహసివిరా! ఎవ్వరులేని సమయమున దొంగవలె నన్నెత్తుకొనివచ్చుటెటిపౌరుషము? దుష్టుడా! జ్ఞానముదెచ్చుకొని నన్నింతట వదలివేయుము. లేకున్న నీవు సబాంధవముగ నాశనము గాగలవు.

రావ___(తనలో) దీనితో నింక మృదువాక్యములు పనికిరావు బెదరించినగాని దీనినోరు మూతపడదు (ప్రకాశముగ కోపముతో) ఛీ! గయ్యాళీ! నోరుమూయుము. ఇంక నిట్లపేలుదుందువేని శిక్షింతును జాగ్రత్త!

సీత___(భయావిహ్వలయై యేడ్చుచు) హా! మనోనాథా! కఠినచిత్తుండగు దైత్యుడొక్కడు నన్ను మ్రుచ్చిలించి చనుచున్నవాడు. రయంబున నేగుదెంచి రక్షింపవేల?

మ॥ అనఘా! యింకను నాపయింగరుణ రాదా? పత్నినొక్కండు దు
ష్టనిశాటుండిటు మ్రుచ్చిలించి చనుచుం • డన్ కావరావేమి? ధా
రుణి నార్త్రావనదీక్షితోత్తములకి • ట్లో దేవ! ధావ్యంబె యిం
కను జాగేటికి? ప్రోవవే ప్రియసతిన్ • గారుణ్యముం బూనవే

రావ___(కోపముతో) ఓసీ! రాకాసీ! నోరుమూసికొందువా, లేక నిన్నీ కరవాలమున కెరచేయుమందువా?

(అని ఖడ్గముజాపుచున్నాడు.)

సీత—(వినిపించుకొనక యె) హా మనోహరా! నీచిత్తము నేడెంత కఠిన వృత్తిబూనినది? హా! సుమిత్రాతనయా! నీకైన నాపై ననుకంప ముదయింపకున్నదా! అయ్యయ్యో? బుద్ధిమంతుడవగు నీమాటల వినకయుండదె నేనింతటిపాటుదెచ్చుకొంటిని? ఇయ్యది చేసేత జేసికొనినది. సుగుణాకరుండవును నిష్కల్మషుండవును నిశ్చలచిత్తుండవును నిరపరాధివియు నగు నిన్ననేకవిధముల దూలనాడిన పాపమూరక విడుచునా? సౌమిత్రీ! నేను మహాపాపిని. నిన్న నరాని మాటలంటిని నీమనమునకు నొవ్వజేసితిని. నాయజ్ఞానమును సైరింపుము. నన్నుమన్నింపుము. నాపై గరుణనింపుము. ఇది యాపత్కాలము, ఇట్టిసమయంబున గక్షసాధింపదలచుట పాడిగాదు.

ఉ॥ ఓనయశీల! నిన్ననుచి • తోక్తుల నప్పుడు దూరితంచు నీ
మానసమందు క్రోధమిసు • మంతయు నాపయిబూనకయ్య నే
డేనిట తత్ఫలం బనుభ • వించితి, నింక చలంబు వీడి ర
మ్మా! ననుగావుమా! అలుక • మానుము నీమదిలోన లక్ష్మణా!

సౌమిత్రీ! నీవతిశాంతచిత్తుండవు, సత్స్వభావుండవు. నీకింత దీర్ఘకోపంబు చనదు. మీయన్నగారితో క్షామొనరంజెప్పి నన్ను రక్షింప బ్రయత్నముసేయుము తొలుత నిన్నాడుదాననగుటచే ద్వరపడి దూషించినను నేనిప్పుడు పశ్చాత్తాపతప్త హృదయనైతి. నన్నింక గరుణింపజెల్లును. అయ్యయ్యో! ఏమిది? నీకుగూడ చిత్తము కరుగకున్నదా? జగదేకశూరులగు సోదరులిరువురుగూడ నిట్లూరకున్న నాకింక నడ్డపడువారెవ్వరు? హా? రామసౌమిత్రులారా! త్రిలోకవంద్యంబైన మీ భాస్కరవంశమున నార్తులయెడ నిట్లు కఠినభావమూనిన వారొకరైనగలరే!

ఉ॥ ఆపగిదిన్ జగద్విదిత • మై తగుసూర్యకులంబునందు సం
దీపితులైజనించి, యశ • నిందితకీర్తిని గన్నమీరల, ది
ట్లాపద బొంది, దీనయగు • నంగననొక్కతె గావలేరె? హా!
పాపమె యార్తరక్షణము? • భావ్యమె మీరిటు లూరకుండుటల్!

హా ! ఎంతకష్టకాలము వచ్చినది! సకలదేవతలు సాక్షిగ జేపట్టిననాథునకును, నిరతంబు నతిభక్తియుక్తుండై నాపై నత్యంత కరుణగలిగి వర్తించు మరదికిని నేడు భారమైతినిగదా ! నన్నింక నెవరు భరించువారు? ఓతల్లీ, భూసతీ ! కదుపునంగన్న దానవు. నీకుగూడ నాయార్తి బాపదలంపు కలుగకున్నదా ? ఏంతకఠిను రాలవు ? నిజముగ నీవచలవె. కాకున్న దనముద్దుబిడ్డ మగనిం బాసి, యొకరాక్షసు చేతబడి, విలపించుచుండ జూచియు దదీయ రక్షణము సేయరాకుందువా ? నేనిప్పుడు యథార్థముగ ననాథనైనట్లె ? నాకింకదిక్కులేరు. మరణమే శరణము. అకటా! బలన్మర ణంబుగూడ మహాపాపకారణమె. ఇంక నేనెందు జొత్తును ? హా, విధీ ? నన్నీ కటికిరక్కసునిచేఁ బడి యెడలేని యిడుములంబడు మని వ్రాసితివానీకు! నేనే మపకార మొనరించితిని ? ఓజనస్థాన వాసులగు మహాత్ములారా ! మీరైన దిక్కులేని నన్ను గాపాడి పుణ్యము గట్టుకొనుడు.

ఉ॥ దిక్కుదొరంగి బెబ్బులికి • దీనతజిక్కిన లేడిపిల్లనాఁ
జిక్కితి నీనిశాచరుని • చేత ; దయామయులార ! మీరలీ
రక్కసు ద్రుంపరయ్య, నను • రాముని జెంగట డింపరయ్య నా
మొ్రక్కులనందరయ్య, కడు • బుణ్యమువచ్చుగదయ్య మీకిలన్

హా! మీకైన నీరెక్కలులేని పక్షిపై ననుగ్రహము రాకున్నదా? ఓవిహంగబృందములారా! మీకు వియన్మార్గగమన శక్తికలదు. నన్నిద్దురాత్ముడు నభోవీధిం గొనిపోవుచున్నవాడు. మీరందర రీతని నెదుర్కొని పోరాడి నన్ను దయజూడుడు. ఓవనమృగయూథంబులారా! మీకుగూడ నాపైనింతకోపమేల?

సీ॥ ఈదురాత్ముని కడ్డ • మీవు రాజాలవా?
పారెదవేటికో • భద్రగజము!
పరికించియుడ స • ర్వవ్యాప్త వీవు నన్
గాపాడరాదె? యో • గగనతలము!

యాలీల నోజాలిఁ • దూలి వేడెడుఁగాని
రారేల? తాపసు • లార! వినరు
అరదంబు దూరమై • యరిగెడి నికనైన
దయఁజూడరే నన్ను • తరువులార!

తే॥ గీ॥ అయ్యయో! యీరీతి నతిదీన • నైమహార్త
నై, విపద్గ్రస్తనై యిదే • యరుగుచుంటి
దిక్కులేక దైత్యునిచేత • జిక్కినేడు
గౌతమీదేవి! నీవైన • గావుమమ్మ.

కటకటా! ఒక్కరికైన, నాపై కనికరము పుట్టదయ్యె. నేనింతటి మహా ఘోరపాపమేమి చేసితిని? ఎన్నియో వ్రతములొనర్చితిని. ఎన్నియో నోములునోచితిని. ఎన్నియో సత్కార్యములొనర్చితిని, వానికెల్లఫలమిట్లు తుట్టతుదకొకరక్కసుండగు రాత్రించరాధమునిచే జిక్కి స్రుక్కుటయా? హా, ఎంతటి దుర్దశవచ్చినది! ఓయార్తావనదీక్షాపరతంత్రా! దుష్టరాక్షస వధావిధానపాండిత్యధురంధరా! భక్తజనసంకటాపహారణా! జనార్దనా! వైకుంఠనిలయా! మహావిపత్పారావారమున మునిగి పోవుచున్న యీ దిక్కుమాలినదాని నీవైన కాపాడలేవే?

ఉ॥ ఓనళినాక్ష! హేవరద! • హే జగదీశ్వర! హేరమేశ! హే
దానవవైరి! హేఖలవి • దారి! నిశాటుడొకండు బల్మిమై
దా నను మ్రుచ్చిలించి పటు • దర్పమునం జనుచున్నవాడహో
దీనశరణ్య! యీ ఖలుని • ద్రుంపవె నన్ పతిచెంత డింపవే.

హా! మాధవా! నాకింక నీవున్న నెవ్వరును దిక్కులేరు. రక్షింపుము. అయ్యయో! త్రిజగత్పాలనా! చతురుండవగు నీకు కూడ నన్ను బాలించుట కిచ్చవొడమకున్నదా? పదునాల్గు భువనంబుల భరించియుండు నీవు నన్నొక్కతె భరింపలేవే! సర్వేశ్వరుండవగు నీవిట్లుపేక్షించి యూరకున్న నింక నను బోటి దీనల కెవరుకర్తలు? మహామహిమాభిరాముడ వీవు చేయఁజాలని కార్యమీ జగంబుల నెందైన గలదే? ఇంక జాగుసేయకుము.

 

అక్కటా! దయామయా! ఎలనీ కికాఠిన్యము ఒక దీనురాలిట్లు విలపించుచుండ నీకానందమే? నన్నీకఠినాత్ముని బారినుండి తప్పించిన దోసమె! నీవెందరెందరి ననాథల రక్షింపలేదు? ఎందరెందరి భక్తుల కానంద మీయలేదు. అట్టివాడ విట్టినన్ చేపట్టలేవే!

తే॥ గీ॥ మేటి గజరాజు గాచిన • నాటికరుణ
అల్ల ప్రహ్లాదుపై జూపి • నట్టి ప్రేమ
నాపయి నొకింత చూప రా • దే పురాణ
పురుష! సర్వేశ! వైకుంఠ! • భుజగశయన!

రావ___అబ్బబ్బా! నీదుఃఖమున కంతము లేకున్నది ఇంక నోరుమూసిన మూయుము. లేకున్న నా కాగ్రహము నిలువదు. ఆభుజగశయను డొక్కడె కాదు, ముప్పదిమూడుకోట్ల దేవతలంగూడి వాసవప్రముఖ దిక్పాలురెల్లరు వచ్చిర రానిమ్ము. ప్రమథగణములంగూడి శంకరు డేతెంచిన చేతేరనిమ్ము. వేయేల? చతుర్దశభువనము లొక్కపెట్టున దండెత్తిన నెత్తనిమ్ము. నిన్ను రావణుండు విడుచువాడు కాడు. ఏల పరితపించెదవు? నామాటవిని దుఃఖముడిగి నన్ను వరింపుము. సకలసౌఖ్యముల ననుభవింపగలవు. లేకున్న నీవు పడునాపద లింతింత కావు.

సీత___హా! జనార్దనా! వీని దుష్ప్రసంగములు మేరమీరుచున్నవి. నీకింకను గృపరాదా? అవును! ఎట్లువచ్చును? నిర్దోషియగు సామిత్రినట్లు పలువిధంబుల దుర్భాషలాడిన నావంటికట్టిడి జూచిన నందరకు గోపమె? ఇట్టి నాకంతకన్న నెట్టిపాటుకల్గును? అయ్యో దైవమా! రథ మతితీవ్రగమనంబున జనెడిని. నాయీగోడు నాథునకుం దెలుపువా రొక్కరైన లేరా?

సీ॥ చెప్పరే యీవార్త • శ్రీరామునకు మీరు
జంథరమార్గగం • చారులార!
ఎరిగింపరే మీర • లేగి నాథునకు నా
గతియంతయును దిశా • కాంతలార
తెలుపరే నాథుదుస్థితి మనోహరుకును

జగమేలు భాస్కర • చంద్రులార!
పలుకరే నాయార్తి • నల దాశరథులతో
నరగున కులమహీ • ధరములార!

తే॥ గీ॥ ఏను శ్రీరామునతి నిటు • లేగుచుంటి
నినకులేంద్రునితో వచి•యింపరయ్య
గరుడగంధర్వ కిన్నర • గణములార
మునిజనములార • సురలార పుణ్యులార.

(తెరలో)

అయ్యో! ఎచ్చటి దీమహార్తధ్వని? ఆఁ తెలిసినది. ఔరా రా? ఎవడవురా నీవు దురాత్మా! దుర్మదాంధా! నిలు నిలుము. అమ్మా! జనకరాట్పుత్రీ! దిగంతములు నిండ నేల విలపించెద వూరడిల్లుము. నేనిదే వచ్చుచున్నవాడను, యార్తిబాపెదను.

రావ—(నివ్వెరపడి తిరిగిచూచి తనలో) ఏమిది? ఓహో మోసమైనది. ఈగయ్యాళి పెద్దగొంతుబెట్టుకొని యేడ్పుటంజేసి యింత మూడినది. ఔరా! ఇతడెవండై యుండనోపు?

మ॥ ఘనమా తోత్రిటిపుటంబు కూరిరమ్యగ నం • ఘాతానర్ఘశోణద్యుతిం
దనరారన్ సముదగ్రకర్కశ మహో • ద్యత్ పక్షవిక్షేప సం
జనితాత్యంత సమీరజాలకముల చం • చత్ సాంద్రకాదంబినీ
గణముల్ దూల విహంగమం బొకటి వీ • కన్నాదెసన్ వచ్చెడిన్

ఇది సామాన్య విహంగమువలె దోపదు. నేనిప్పు డేమిచేయుదును? ఎదుర్కొని పోరుదుమన్న జయమెవరికో, పరాజయ మెవరికో. నేనొంటరిగ నున్నాడను. ఇప్పు డితనికి జిక్కకుండ, సత్వరంబున బారుటకన్న గర్తవ్యములేదు. నాకత డడ్డమువచ్చి నిలిచినప్పుడటికి యథోచితముగ వర్తించెదను. (ప్రకాశముగ) సూతుడా! రథంబును సత్వరగతిం దోలుము. నీచాకచక్యంబు జూపుట కిదియే యదను.

సూతు—ఇదిగో నాసామర్థ్యంబు జూపుచున్నాడను (అని రథమును వేగముగ తోలుచున్నాడు)

సీత—(తనలో) అహా! మహావిపత్సముద్రమున గొట్టుకొనిపోవు నాకిప్పు డొక్కింత సాయము కలిగినది)

(అంతట జటాయువు ప్రవేశించుచున్నాడు.)

జటా—(ప్రవేశించి భయంకరస్వరముతో) ఓరీ! దుర్మతీ, నిలువుము పారకుము, నీకు కాల మాసన్నమైనది. (సీతతో) అమ్మా! ధ రాతనయా!

చ॥ అతుల బలాన్వితుండను జ • టాయువు ధారుణినుండ నిన్ను నీ
వితమున దానవుం డొకడు • వేకొనిపోవగలాడె? నీమదిన్
వెత విడు, మిప్పు డస్మదురు • భీషణరోషమహాశిఖ నార్పులన్
క్షితిబడగూల్తు నీఖలుని • చిత్తమునందున నీవు మెచ్చగన్.

అనంతరమున సురాసుర లకజేయుండనై నిన్ను నాపై నెక్కించుకొనిపోయి నీవింభుడగు, శ్రీరామచంద్రుని పాదారవిందములచెంత డించెదను. నాప్రాణము లీమేననుండువరకు నీకు నిసుమంతయు భీతి లేదు నీవింక వగవకుము. (రావణునితో) ఓరీ కూరాగ్రేసరా!

ఉ॥ ఎవ్వడవోరి! దైత్యకుల • హీన! త్రిలోకపవిత్రి నీమె నీ
వివ్విధి జోరవృత్తిగొని • యేగెదు, నిల్వుము నిల్వుమిప్పుడే
చివ్వకురమ్ము, నీయొడలు • జిల్తు, నినున్ ధరగూల్తు నేడు నీ
క్రొవ్వడగింతు నీయమకు • గూర్తు ముదంబు నిశాచరాధమా!

రావ—అరరే! వీడిప్పుడే సమీపించుచున్నాడు (సూతునితో కోపమున) ఓరీ! అసమర్థుడా! ఇదియేనా నీసారథ్యము; త్వరగాబో నిమ్ము, హయముల నదలించుము. వీనికిజిక్కకుండ రథమును లంకాపురిం జేర్చితివేని నీకు గొప్పబహుమానము జేయుదును. జాగ్రత. మెలకువగలిగి యుండుము.

సూతు—అయ్యా! కోపింపకుము, ఏలినవారి యనుగ్రహ ముండవలయుగాని సారథ్యమునకేమి? ఇదిగో చూడుడు. రథముందోలుచున్నాడను! ఇక వన మీపక్షికే కాదు. వీనిని సృజించిన బ్రహ్మకైన జిక్కను. ఒకరెప్పపాటున మిమ్ము లంకంజేర్చెదను.

(అని రథహయంబుల నదలించుచున్నాడు)

రావ—బలే! సూతుడా! రథమిదే తీరున బోనిచ్చుచుండుము.

జటా—(సత్వరమున బరువెత్తుచు) ఓరీ పారుబోతా! పరువెత్తకుము! స్వర్గమర్త్య పాతాళాదిలోకముల నెందున్నను సీతను విడువనిది నిన్నీజటాయువు విడుచువాడు కాడు. (రథమునకడ్డముగ నిల్చి) ఓరోరి మాయావీ నిలువుము.

తే॥ గీ॥ అరుగునే యుక్కు గుండు జ • చ్చెర భుజింప
విరుగునే త్రుంప మేరుభూధరము, దుష్ట!
పరమసాధ్వీమతల్లి నీ • ధరణితనయఁ
గొనదలంచితి వీమెచే • కురునె నీకు?

రావ—(సూతుని గనుగొనుచు) ఛీ దుష్టుడా? ఇదియేనా నీసారథ్యము; నీమూలమున నాకిట్టిచిక్కు కలిగినది. ఇప్పటికైన దెలివి గలిగి రథము నీప్రక్క గదిప్పి తోలుము.

సూతు—(చిత్తము అని రథమును మఱియొకత్రోవకు దోలును).

జటా—ఓరీ! ఎక్కడకుబోయెదవు! నాకంటబడి నీవింకను దప్పించుకొనగలవా? నన్నేమనిగ నెంచితివి? భవాదృశులగు కుమతుల పాలిటి కాలుండననుకొమ్ము. ఈయరుణపుత్రుండు నిన్నింక ప్రాణములతో విడువడు. శ్రీరాముని మహాపరాక్రమమైన దలంపక, త్రిజగత్పవిత్రియగు నీమహాసాధ్వి పాతివ్రత్యమునైన నెంచక, నిర్భయ చేతస్కుడవై యిట్టి యకార్యంబుసేయ నొడిగట్టిన నీకుదగిన శిక్షనొసంగకపోను. దుష్టుడా! నీచదానవకులుండవగు నీవెక్కడ, అమానుష తేజఃపరిపూర్ణ యగు నీమె యెక్కడ! సీతయన్న నేమనుకొంటివి!

ఉ॥ ఘోరనిశాటబృంద మద • కుంజర సింహనమాను రాజకం
ఠీరవు ధీరు రాఘవుని • నీమది నెవ్వనిగా దలంచితో
క్రూరుడ! అట్టిపార్థివకుమారుని పత్నియైన ధరాతనూభవన్
గోరితె! ప్రాణహాని నెద • గోరెదు కాకముభంగి దుష్టుడా!

సేవించుటకు దగినఫల మనుభవించెదవుగాక. నిలునిలుము.

(అని కదలకుండ రథమునుబట్టి రావణుం గదియుచున్నాడు)

రావ__(తనలో) ఈ ఖగాధముండు నన్ను విడచి చనునట్లుతోచదు. ఈ పాడుసారథివలన నింతమూడినది. కానిమ్ము; కొంతవరకు మాటలతో భయపెట్టెదను. కార్యమువింంచిన ఖడ్గముధరింప వచ్చును (అని ప్రకాశముగ) ఓరీ! అల్పుడా! ఎందుకెందుకని యూరకొన్నకొలది నీ వాచాలత్వము మేరమీరుచున్నది? నా కాగ్రహము వచ్చిన త్రిభువనంబులును గడగడ వడంకును సుమీ! నీకీలేనిపోని ప్రయాసమెందులకు? నీదారిని నీవుపొమ్ము.

జటా__పాపము యుద్ధమనిన నీకెంతభయమో; కానిమ్ము సీతనువిడువుము. అట్లే పోయెదను. అసమర్థుండవగు నీతో గయ్యాలి నగుట నేలకి?

రావ__(కోపముతో)

ఉ। ఏర ఖగాధమా! భయ మొకింతయులేక పురందరాదుల
భూరి బలాతిరేకమున • భోగుచ నుద్ధతి గర్వమట్టి దు
ర్వార బలాఢ్యుడైన దశ • వక్త్రుని చెంగటనిల్చి యీగతి
కారులు ప్రేలజొచ్చితివి • కాలునిజాడ దలంపుగల్గెనే.

జటా__కాలునిజాడ తలంపునాకులేదు. నీకు జూపింపవలయునని నా యభీష్టము. అదియిప్పుడే నెరవేరగలదు.

రావ__ఓరీ! పులుగా! త్రిజగదేక వీరుండగు యీదశాస్యుని పరాక్రమమెరిగి, మాటలాడుము జాగ్రత్త!

జటా__చోరత్వమునం దారితేరి సీతాసతి నిట్లు మాయచే వ్రుచ్చిలించి తెచ్చిన నీపరాక్రమ మేనెరుంగుదును. ఎరిగియె మాటలాడుచున్నాడను.

రావ__ఓరీ దుష్టుడా! నీకింక నాయువులేదు. నీకీదినముతో నూరేండ్లునిండినవి. కావుననే యిట్లు మాటలాడనారంభించితివి.

జటా—నాకుకాదు నీకే నూరేండ్లు నిండుటంజేసి మహాగ్నికణంబు నుంగని రత్నమని భ్రమించి చేకొనినట్లు, సాధ్వీమతల్లియగు సీతను సాధారణయువతిగ నెంచి వ్రుచ్చిలించి తెచ్చితివి.

రావ—వ్రుచ్చిలించితినా?

జటా—కాకున్న నీమెం దేగలవా? మహాపరాక్రమశోభితుండగు రాముండు నిన్నుజూచినప్పుడే యమసదనంబున కతిథింగావించి యుండును

రావ—ఏమేమి? హీనుండగు రాముడే నను వధించుట? ఇట్లతిక్రాంతమర్యాదుండవై మాటలాడెదవు నీవు తప్పక శిక్షార్హుండవు కాగలవు. నాసమర్థత నెరిగివర్తింపుము.

జటా—నీవు సమర్థుండవైన, గయ్యమున కేల జంకుదువు?

రావ—(ఆగ్రహముతో!) ఛీ ఖగాధమా! యుద్ధమునకు వెరచితినని తలంచితివా?

ఉ॥ పోటరినై దిగీశ్వరుల • భూరిబలంబున గెల్చినట్టి నన్
బోటిమహాబలాఢ్యులకు • పుల్గును జంపుట పౌరుషంబుగా
దేటికి నీనితోడ బసి • యేమని యెంచితిగాని కానిచో
గీటడగించి కాలుపురి • కీక నినుబంపనె రెప్పపాటునన్.

జటా—ఏమి? నాతో బోరుట పౌరుషముకాదుగా! నీకంత తెలివిక దోచుచున్నాడనేమి? పోనిమ్ము, సాహసమున గార్యము సాధించుకొనుట యుత్తమలక్షణము కావున నీకు క్షేమకరంబును మంగళప్రదంబునునగు నొకనీతి నుపదేశము సేయదలంచితిని. నీవద్దాని వినుము, లేకున్న జెడిపోదువు.

రావ—ఎట్లు? సకలధర్మాధర్మసంవేదియు సమస్తనీతిజ్ఞుండునగు నీదశకంఠునకు పక్షిమాత్రుండవగు నీవా నీతి నుపదేశించువాడవు? చాలును, నోరుమూసికొనుము, ప్రాణంబుల గాపాడుకొనుము.

జటా—పక్షిమాత్రుండనని నన్ను దిరస్కరింపకుము. ఇదిగో. నాచెప్ప దలచినదానిం జెప్పుచున్నాడను, ఏమందువేని,

చ॥ ఇలలయి గొన్ని నాళ్లు ముద • మేర్పడ సౌఖ్యములంద నీమతిం
బలవిలి వేని రామవసు • ధావరు మానిని నిందుడించి చం
చలమతి లేక నీపురికి • జయ్యన బొమ్మటుగానిచో వ:దు
జ్వాల నఖచంద్రిహాసముల • పాలయి పోయెదవీవు దైత్యుడా!

నీకీయుపదేశము సమ్మతమేనా? కానిచో యుద్ధమునకు సంసిద్ధుడవుకమ్ము.

రావ___ఓరీ ! నీయుపదేశములింక గట్టిపెట్టుము. మేమేగవలయు. నీతో నూరక వాగుచుండుటకు సమయము లేదు తొలుగుము (సూతునితో) సూతుడా ! నీవింక సత్వరంబుగ రథమును బోనిమ్ము.

సూతు___అయ్యా ! అట్లే చేసెదను (అని రథము దోలబోవుచున్నాడు)

జటా___(రథమునిల్పి) ఆఁ నిలువుము నిలువుము, సీతను విడువ కెట్లు. పోయెదవు ?

రావ___ఏమి, నీమదము, రథము నేల నిలిపెదవు ? నీపై బాణములు, విడుతుగాని సీతనువిడువను. తొలగిపొమ్ము.

జటా___నీవు సీతను విడువకున్న నిన్నునేను విడువను.

రావ___(కోపమున) ఓరి విహంగాధమా !

చ॥ దురమున నిల్చునేని యల • దుర్గతిశ్రీకైన నవంతయుఁ జదిక్
వెరువని నేను నేడిచట • నీచఖగంబును నిన్నుజూచి యీ
సరసిజలోచనన్ విడచి • చయ్యన బారుదునంచు నెంచితే?
యరుగుము చాలుజాలు విహ • గాధమ ప్రేలగ నేటికిగతిన్!

జటా___దశకంధరా ! ఏమి సీతను విడుతువా, లేదా ?

రావ___ఓరీ ? నీకిన్ని మాటలతో నేమిపని ? నామేన ప్రాణములుండు వరకు నీసీతను హరిహరాదు లడ్డమువచ్చినను విడువను. ఇంక నీదారిన నీవేగవచ్చును.

జటా___ఛీ జడుడా! నీవింకను మూర్ఖమును విడువకున్నాడవు. నామాటవిని సీతను వదలుము. లేకున్న నీవు తప్పక హతుండవు కాగలవు.

రావ—పులుగా ! నీవు మాటిమాటికి నన్ను బెదరించుచున్నాడవు నేనింతమాత్రంబునకు విడుచువాడగాను. నీకు బ్రాణములపై నాశకలదేని సీతజోలి నెత్తుకొనక నీనిలయంబున కరుగుము

జటా—ఓరీ, నేను నీవలె యుద్ధమునకు వెరచువాడగాను.

రావ—నాకుకూడ వెరవవా?

జటా—నీకే కాదు, నీయబ్బకుకూడ జకంను.

రావ—ఓరీ ! గర్వాంధా !

ఉ॥ లీలను మేరువుకా తగరు • ఢీకొనగోరు విధాన నేడు నీ
వాలములోన నన్ను గెలు • వగా దలపోయుచు నున్నవాడవో
బాలిశ! నీవుదండధర • పావక వాసవ మారుతాది ది
క్పాలురకన్న నుగ్రరణ • పాండితి నంత మహోఘనుండనే?

జటా—అట్టిఘనుండ వగుచో దియు కానిడియు నీవ్వాడెట్లు తెలియును? క్షణ మాత్ర మహ హంబున నిలిచిన నంతయు దేటపడగలదు.

రావ—నీవుమాటిమాటికి గయ్యంబునకేల కాలుదువ్వెదవు? తొలగి పొమ్ము. మాకష్టము రాకుము, సూతుడా! మనకు వీనితోనేమి పని? రథము శీఘ్రమున బోనిమ్ము?

సూతు—(రథము ను దోలుచున్నాడు)

జటా—(ఆగ్రహముతో) ఓరి నిశాటకులాధమా!

ఎన్ని చెప్పినను వినక పారుచున్నాడవా? ఇదిగో చూడుము నాప్రతాపము జూపెదను (అని రివ్వున రథముపై దుమికి రావణునిపై గవియుచున్నాడు)

రావ—(కోపముతో) ఓరిగర్వాంధా! నిన్ని దేనదియు కొంపశరాఘాతం బున ముంచెద గాచుకొమ్ము.

(అని జటాయువుపై బాణము విడుచుచున్నాడు)

జటా—(రోషపరవశుడై) ఓరీదుష్టా! త్రిభువనకంటకా!



ఉ॥ శాక మదీయ శత్రునికు • రంబ మదాపహయప్రవీణ దు
ర్వార కఠోర శాతనఖరప్రకరంబుల నీదు దేహముక్
జీరి, కవోష్ణశోణితము • జెచ్చెర గ్రోలి తదీయమాంస మిం
పార భుజించి తృష్ణయును • నాకలిమాను పుకొందుహాయిగా

(అని రావణునిపై గవియుచున్నాడు)

రావ—(జటాయువుపై బాణము వేయుచున్నాడు)

అంతనిరువురు సంకులముగ బోరుచున్నారు)

జటా— అరే, దురాత్మా! చూడుము, నీమహారథంబు తుత్తునియలై నేలం గూల దాకెదను (అని రావణునిరథము విరుగదన్ని సారథిం గొట్టుచు హయముల జంపుచున్నాడు)

రావ—(సీతతో నేలపైదుమికి తనలో అబ్బబ్బా! వీనిదెబ్బలకుముందు నేను నిలువజాలకున్నాను. ఈపాదఘాతముల నఖప్రహారములచే నా యొడలంతయు చిల్లులువడి రక్తమయమైయున్నది ఇంక నేను యుద్ధము చేయజాలను. ఈతనిధాటికి తాళజాలను సీతను విడువజాలను అయ్యయ్యో నేనిప్పుడేమి చేయుదును? ఇంకగాలికి బుద్ధిచెప్పుటకన్న గత్యంతరము లేదు (అని సీతను చంకనిరికించుకొని పదములు తొట్రుపడ బారిపోవుచున్నాడు)

జటా—(రావణుని వెంటబడి) . ., సామిభోగా? పరికిపందా!

కం॥ ఆలమున దేవకోటుల
దోలిన ఘనుడవను కొంటి • దుష్టుడ! నే
లీలనొ గి బారుచుంటివె!
బాలిశ! యిటు దెలిసె నీదు • పౌరుషమెల్లన్.

ఓరీ! పారిపోవుచుండ వాక్కడపుపోక సీతాసతింగూడగొని పోవుచున్నాడవా? ఇంకను నీకామిపైగల దురాగ్రహంబు దొలగ లేదుగా? ఇదిగో ఈతన్నుతో నీకాబుద్ధిమందులు నేమో చూచెదను (అని రావణుని వీపువైదన్ని నఖముల జీరుచున్నాడు)

రావ—(తనలో) అబ్బబ్బా! వీనితన్ను వజ్రముగాను. నా వెన్నంత నదిరిపోయినది. ఇప్పుడేమి సేయుదును! కానిమ్ము వేసినిట్లు వెరచిపో

కుట కర్తవ్యముగాదు. సాధ్యమగునంతవరకు పోరెదను. ఇరందును నావలెనే రక్తసిక్తాంగుడై యున్నవాడుగదా! ఇంకనెంతోసేపు పోరజాలడు (అని ప్రకాశముగ) ఓరీ! ఖగాధమా! ఈతూరి నీవు తప్పక హతుండవయ్యెదవు చూడుము. (అనిసీత నొకచో డించి జటాయువుతో యుద్ధముసేయ నారంభించుచున్నాడు)

సీత—(తనలో) ఓహో! ఇప్పుడీ ద్వంద్వయుద్ధమెంతయు భయానకమై తోచెడిని. అయ్యయ్యో పాపమీ ఖగోత్తముండెంత యలసినాడు? ఆహా! నాకైకదా యతడిట్లు మహాశ్రమకోర్చి పోరదొడంగెను. నేనీమహాత్ముని ఋణమెట్లు తీర్చుకొనగలను? ఇప్పుడిం దెవరు జయింతురో తెలియకున్నది.

జటా—(తనలో) అయ్యయ్యో! వీనిసత్వమెంతకును దగ్గకున్నది నేనేమిసేయుదును? నా కమితాయాసము గలుగుచున్నది. రక్తమిసుమంతయైన దేహమున లేదు.

మ॥ అసురుం డుద్ధతిసేయు వ్రేటులను కాయంబెల్ల గాయంబులై
వెసమాంసంబులతోడ శోణితము పృథ్విం గాల్వలై పారెడిన్
పసతగ్గెన్, ధృతితూలె, నెట్లు రణమున్ గావింతు నేరీతి నీ
వసుధాపుత్రిం బ్రోతు సిగనుజా నేభాతిన్ వధింతున్ కటా.

హా! రామచంద్రా! అధికప్రయత్నమొనర్చియు నీపత్ని సీతను జారినుండి తప్పింపజాలనైతిగదా? తల్లీ జనకసుతా! నిను విడిపించి నీమనోహరు సంతసింపజేయు భాగ్యము నాకబ్బదయ్యెగదా ? హా ! (అని సొమ్మసిల్లి యొకవృక్షమునకు జేరగిలబడి నిలచి నిట్టూర్పులు, పుచ్చుచున్నాడు)

సీత—(జటాయుంజూచి తనలో) కటకటా !! ఇతనికెంతదుర్దశవచ్చినది? ఇప్పుడితనికి సాయబడువారెవ్వరు? హా, దైవమా! ఇట్టియుత్తమోత్తమునకా నీవిట్టియాపద జేకూర్చుట? (అనివిషాదాక్రాంతయై యుండును)

రావ___(జటాయుంజూచి) (తనలో) భళిరే, ఇప్పుడు నేను గెలిచితిని. అతంతెంతయు, సొమ్మసిల్లియున్న వాడు. ఒక్కింతతడవు విశ్రమించిన మరలనాపై గదియును. అట్లుగాకుండ వీని నిప్పుడేతుద ముట్టించిన నేబాధయుగలుగదు. (అని ప్రకాశముగ) ఓరీ, సీతకు మహాపురివలె నాకడ్డమువచ్చి పోరితివి. ఇప్పుడెట్టులున్నది ? ఇదిగో చూడుము. నాయుద్దంబువిరచి నన్నిట్లు విరోధించిరందుకు నీకాధారభూతములైన నీ తెక్కలు నరికివైచి నాకసి దీర్చుకొనుచున్నాడను. (అని క్రిందబడియున్న యొకఖడ్గము బుచ్చుకొని జటాయువు తెక్కలు తెగగొట్టుచున్నాడు)

జటా___హా ! (అని తెక్కలుతెగి భూమిపైబడును)

సీత___శివశివా ? (అని కన్నులుమూసికొనుచున్నది)

రావ___(సంతోషమున తనలో) సెబాష్ ! ఇప్పుడు సంపూర్ణవిజయంబు గైకొన్న వాడనైతి.

సీత___(కన్నులువిప్పి జటాయువును సమీపించి చూచి) (దుఃఖముతో) హా! వీరోత్తమా! హా పరోపకార దీక్షాపరతంత్రా!

ఉ॥ హా! విహగాన్వయాబ్ధి కుముదాప్త; మదార్తికి జాలినొంది నన్
గావగవచ్చి ఘోరమగు కయ్యమొనర్చి దురాత్ముడైన యీ
రావణు చేతిఖడ్గమున వ్రాలితె పక్షము లూడి భూమిపై
నీవిధిమోసమయ్యె నికనెవ్వరి జీరుదు? నేమిసేయుదున్ ?

మహాత్మా! నీకునామూలంబున నెడెంతగతిపట్టినది. అయ్యయో నీవిట్లు నాకుసాయముగ వీనికడ్డము రాకున్న, నేనెట్టియాపదజిక్కియున్నను నీవుమాత్రము సుగక్షితముగ నుండియుందువుగదా? కటకటా! ఇట్టి దౌర్భాగ్యగాలనగు నను విడిపింప నీకేలతలంపుకలిగె? కలిగెబో దైవము నీకింతటియార్తి దెచ్చిపెట్టనేల! హా! నీయట్టి పరోపకార పారీణున కిట్టిపాటు రాదగినదే? కట్టా? నీకీదురవస్థ కీమాయరావణుం డేడ దాపరమయ్యె? హా వీరవరేణ్య! హా విహంగశేఖరా! హా బుధోత్తమా! ఇంక నేదిదిక్కు!

జటా—(కొంచెము తెప్పరిలి కన్నులుతెరచి సీతంజూచి బాష్పములు విడుచుచు గొనయూపిరితో) అమ్మా! జానకీ! నాకర్మఫలమిట్టిది. ఇందుకునీవేమి చేయుదువు? ఊరడిల్లుము. నాభాగ్యవశమున నీయాపదవాయుకాలము వచ్చి శ్రీరాముని సందర్శనమబ్బనేని నీయీవార్త నెరిగించి నాజన్మము సార్థకము గావించుకొందును. లేకున్న నిట్లె దురవస్థంబనుచు తుద కేకాకివనమృగము నోటనోపడి దుర్గతిం జెందుదు తల్లీ! మాటలాడుటకు సయితము శక్తిలేదు నాపైననుగ్రహమాడుచుము. కన్నులు మూతలుబడుచున్నవి. మూర్ఛవచ్చుచున్నది (అని పడిపోవును)

సీత—హా! ఎంతకష్ట మెంతకష్టము.

రావ—(దిక్కులుపరికించి) అదిగో! అదిగో! సంధ్యారాగము లెల్లయెడల వ్యాపించుచున్నవి. భూమండలంబెంతయు రక్తశోభ నందెను. గగనతలంబు చల్లనడినది. లోకబాంధవు డుగ్రత్వంబు విడచి శాంతుడగుచున్నవాడు మరియును.

చ॥ అతులితశౌర్యసంయుతు జటాయువు నుగ్రరణాంగణంబునన్
క్షితి బడఁగూల్చి రామునతి జెచ్చెర గైకొని యేగుచీమహా
ద్భుతమును జూడనోడి భయము గొని పారెడినో యనన్ దివ
స్పతి చరమాద్రిమాటునకు జయ్యన నేగుచునుండె నిత్తరిన్

ఇంక తడవుసేయుట తగదు. సత్వరంబున సీతాదేవిం గొని యేగెద (సీతంజూచి) ఇమ్మగువ జటాయువు వధింపబడుటచే నెంతయు దుఃఖాక్రాంతయైయున్నది. కొంచెము పలుకరించెద గాక (ప్రకాశముగ) తరుణీ! మనయాగమనంబును నిరోధించిన యద్ధురాత్ముండు నాచే హతుండయ్యె, నీకింక నేటిచింత? లెమ్మా. మనము మనలంకానగరంబునకు బోవుదమురమ్మా.

సీత—ఓరీ! కిరాతుడా! పరోపకారదీక్షితుండగు నిట్టి ఖగపుంగవుని నిర్దయుండవై రెక్కలు చీల్చివైచిన నీముఖము జూడరాదు. తొలగిపొమ్ము (అని ముఖముద్రిప్పుకొనుచున్నది)

రావ__చంద్రవదనా! ఇంకను నీవు నాపై కృపజూపవుగదా! అబ్బబ్బా! స్త్రీల హృదయము లెంతకఠినములు! (యోచించి) అట్లన జెల్లదు. తరుణులొక్కొక్కవేళ బురుషుల హృదయము లెరుంగ గట్టి పరీక్షలు సేయుచుందురు. కుటిలకుంతలా? నన్నేటికిట్లలయించెదవు? నామాటవినుము. నాకింక ననుకూలవు గమ్ము. నీవిషమపరీక్షల గట్టిపెట్టుము. జలజగంధీ! మొగంబు నట్లేల పెడకు ద్రిప్పుకొంటివి? ఏది? మదన బాణానల దందహ్యమాన మానసుండనగు నన్నొకతూరి నీక్రిగంట వీక్షింపుము.

సీ॥ అల శరద్రజని బొల్పారు రాకాచంద్రు
మించు నీనగుమోము గాంచనియవె
పసిడికన్నను గాంతి నెసగునీమైందీవ
నింపుమీరగ కౌగలింపనియవె
నిద్దంపు టద్దాల కుద్దియౌ చెక్కిళ్ల
నొకసారి ముద్దు బెట్టుకొననియవె
చిక్కని సుధలొల్కు చిగురాకు కెమ్మోవి
గ్రుక్కనమునిపంట నొక్కనియవె

తే॥ గీ॥ చెలియ నాపయిం గొహానశీతలములైన
నీకటాక్షపరంపరల్ నిగుడనియవె
అసమబాణుని ములుకుల పసయడంగ
బాల! నినుగూడి మరుకేళి దేలనియవె!

సీత__ఛీ! నీచుడా! నీదుష్ప్రసంగము లిక నిల్పుము. బ్రతుక నెంచితివేని నన్నింతటనైన విడువుము. లేకున్న నీవు సబాంధవంబుగ రామునిచే హతుండవు కాగలవు.

రావ__కమలనేత్రా! సురాసురప్రముఖులనందర బరాభవించి హరిహరాదులనైన లెక్కగొనని, నన్ను హీనులగు రామలక్ష్మణులం జెప్పి భయపెట్టజూచెదవు. నన్నేటివానిగ దలంచుచుంటివి?

సీత__ఓరీ! జగదేకశూరులగు రామసౌమిత్రులను సామాన్య మానవులలో గణించుచున్నాడవు. అట్లుకాదు. చతుర్దశ సహస్ర

సంఖ్యాకులగు ఖరదూషణ ప్రముఖ రాత్రించర సమూహంబుల బరిమార్చిన మేటియగు శ్రీరాముని వామపదనఖాంచలములకైన నీవు సరిరాజాలవు.

రావ—పడతీ! నీవు నన్నుదూషించినను భూషించినట్లే యికనైన నాపై గోపముడుగుము. నీవురాక మూర్ఖకలిన బలిమినైన గొనిపోయెదగాని నీ మనకు వెరచివిడువను. నిన్నింతవరకు గొనివచ్చినది మరల విడుచుటకు కాదసుమీ

సీత—తుచ్ఛుడా! శ్రీరామునకు నీవేకాదు ధూర్జటియైన వెరచునను టతిశయోక్తి కాదు రాముని గెల్చుట నన్ను జోరవృత్తిం దెచ్చుటకాదు.

చ॥ ఎవరును లేనివేళగని • యింటజొరంబడు శ్వానమట్లునా
ధవుడు మరందిలేనియెడ • సంభవమునకా ముని వేషమూని నా
జవమున దస్కరించుటిది • శౌర్యమె? రాముడు చూచెనేని నీ
దవిలి వధింపడే సమర • ధాత్రిని బ్రాణము నిల్వనేర్చునే?

రావ—సీతా! నీవుమాటలతో గాలముపుచ్చుచున్నదానవు. నాకింక జాగుపనికిరాదు. మంచిమాటలతో బ్రతిమాలుచున్నాడను. నడువుము. లేకున్న నింక బలాత్కరింపబడెదవు. పర్ణశాలనుండి నిన్నింతవరకెట్లు గొనివచ్చితినో యట్లే లంకకు గొనిపోయెదను

సీత—ఓరీ! నీకింత దుర్బుద్ధితగదు. నీనాశనమును నీవే తెచ్చుకొనకుము. నాపైగల భ్రాంతినింక విడువుము.

రావ—మూఢురాలా? నేనెంతచెప్పినను నామాటబాటింపక మాటిమాటికి నానాశనము గోరుచున్నదానవు. నిన్నిప్పుడు మదీయబాహుబలిమింబట్టుకొని గగనమార్గంబున లంకాపురికి గొనిపోయెదను చూడుము. (అని సీతను బట్టుకొనబోవుచున్నాడు)

సీత—హా! దుష్టా! సాహసింపకుము, సాహసింపకుము (అని యొకవృక్షమును గట్టిగబట్టుకొని) ఓరీపాపకర్ముడా! నీచావును నీవే

తెచ్చుకొనుచున్నాడవు. నీకింక భూమిపై సౌఖ్యముండు [illegible] లేదు.

క॥ తనధవుని యాజ్ఞలేకయె
కినుకన్ శపియింప సాధ్వికిం దగదటుగా
వున నూరకుంటి గాకుం
డిన నింతకు మున్నె త్రుంపనే నిను జడుడా!

రావ—ఆ! నీకంతటిశక్తికలదుగా? సరే! దీనికేమి! ఇంకనైన నామాటవిందువా, బలాత్కరింపమందువా?

సీత—దైత్యుడా! పతివ్రతల కిట్టి మహాకష్టములగూర్చుట పాపహేతువు? జ్ఞానముదెచ్చుకొని నన్నుమరల మాపర్ణశాలకడ డించి పొమ్ము. అట్లుజేసెదవేని నీవు రామునికంట బడినను నీప్రాణముల దీయకుండునట్లు నానాథుని నేను వేడుకొందును. ఆయనకృపాంతరంగుడు, నిన్ను క్షమించి విడువగలడు!

రావ—నిన్నువిడుచుటకల్ల! సీతా! వృక్షమును గట్టిగబట్టుకొన్నంత మాత్రమున నిన్ను విడుతునని తలంచితివా? నడువుము, నన్నేల విసికించెదవు?

ఉ॥ ఏటికి మూర్ఖ? మాపగిది • నీడిగిలంబడనేల? నేడు ము
క్కోటినిలింపులైన భువి • గూల్తురుగాక నినుంద్యజింపనో
బోటి మనంబునన్ మరచి • పొమ్మిక నీధవు రామచంద్రు నీ
మాటలు సాగిరావు ఘను • డైన దశాస్యుని చెంత నింకపైన్.

సామమున గార్యము సాధింపవలెనని నేనింతవరకు దాలియుంటిని. ఇక నీటక్కులు నాముందు పనికిరావు. నాతో గూడ లంకకువచ్చెదవా లేక బలవంతముగ నెత్తుకొని పొమ్మందువా?

సీత—హా! దైవమా! నన్నీదుష్టునిబారింబడకుండ తప్పింపజాలవా? (రావణునితో) ఓరిక్రూరుడా! నిన్ను శపించినమదీయతపంబంయుశక్తిత్తయైచెడునని శంకించుచున్నదానను ఎన్నా రాముండే వధించుగాక. నీవామహాత్మునిమూలముననే సబాంధవముగ నాశనమయ్యెదవుగాక

రావ__(కోపముతో) ఛీ మూఢమతీ? మంచిమాటలతో నీవు లొం
గునట్లు తోచదు. ఇదిగో సాహసించుచున్నాను. నీవు నీదుష్ప్ర
యత్నమును (అని పెట్ట దర్చి తరువు విడిపించి రోదనము
సేయుచున్న సీతా[illegible]ని గగనమార్గమున నిష్క్రమింపు
చున్నాడు)

జటా__(అటునిటు బొరలుచు నిట్టూర్పువిడిచి తనలో) అక్కటా?
నేడు నాకెంతగతిపట్టినది! అస్థిరంబగు నీదేహమును విడువ
వలసి వచ్చినందులకు చింతింపనుగాని మహాప్రయత్నమొన
ర్చికూడ సీత నద్దురాత్ముని బారినుండి తప్పింప జాలనైతి
నని నాకెంతయు దుఃఖముగనున్నది. ఈబాధగూడ భరింపశక్య
ముగాకున్నది. అయ్యయ్యో పరోపకారార్థమిట్లు ప్రాణములపై
గూడ నాసమాని పోరాడినను నాకష్టమంతయు వ్యర్థమైపోయె
నుగదా హా! దుర్భరంబగు నీశ్రమ నెట్లుసహింతును? దైవ
మా? నాపై నీ వింతనిర్దయ నేటికిసహించితివి!

చ॥ దనుజునిచేతచిక్కి ; అతిదైన్యమునన్ కడుమ్రొక్కి యేడ్చునా
జనకతనూజ పాటుగనజాలక యేగతినైన నామసా
ధ్వి నటుశక్తి బోరివిడిపింపగ గోరి రణంబుసేయునన్
కనికరమింతలేకటుల గాఱియవెట్టదలంచి నాకవే!

ఓ జీవమా! శ్రీరామచంద్రున కీవార్తను చెప్పువరకు నీవు
నాతనువునుండి పున్నెముగట్టుకొమ్ము దైవమా! నాకమ్మతా
త్ముల దర్శనము సత్వరంబున గలుగునట్లు చేయుము.

శ్రీమద్భగవతీ కటాక్ష సంపాదిత కించిత్కవితా
జ్ఞాన సమేత, మల్లాది గోపాలకృష్ణ ప్రణీ
తంబైన సీతారామ వియోగమున
పంచమాంకము
సర్వము బ్రహ్మార్పణము.



# కీర్తనలు

1వపేజి 4వపంక్తి తరువాత అనుబంధము

రాముడు. ఖ్యాగ్—దాదరా.

కటుభీతిగొల్పు హా - యీయుగ్రవనంబూ
మత్తేభముల్ - శార్దూలముల్ - నల్దిక్కులందునా॥
గర్జారవంబులు - కవకా వినంబడెకా - పతీమణి యె
ట్లిట్యేడచరించుకా॥

5వపేజి 18వపంక్తి అనుబంధము 2.

సీత. ఖాని—చతురశ్రి.

ఓ హృదయేశ్వరా - నన్గాంగదే ॥ఓ॥
శ్రవణపుటంబుల్ - ప్రియ్యాగవరచుదు దనుజాడనడ్తా
యీయాటవికిఁ - నచ్చుదుండె గతియెట్లింకను ॥శ్రీ॥

6వపేజి 17వపంక్తి అనుబంధము 3

లక్ష్మణుడు. ఖ్యాగ్—అఠ.

పాపి పరుషములు - పలికెద విధి నీ - ప్రాణాంతకమగుగాదా -
రాక్షసా - దుర్మదాంధ ॥పా॥
పాడియెరుంగక - పాపపుచదువులు - పలుమరుపల్కిన
విప్రుడే - చాపముచేతను - జంపి జముని కేర్పెదగనుమా -
కలుషాత్మా నీవిధరంబ్రితుకగ - నేంపినపామ్మాత్ర
వచ్చినదారికి ॥పా॥

7 వ పేజి 12 వ పంక్తి తరువాత. అనుబంధము 4.

రాముడు. ఖ్యాగ్—అది.

తులువా - పలువా - కడరూ - టిదియే -
చెడెదవురా - పోపొమ్మికవేగన్ ॥తు॥

11 వ పేజి 9 వ పంక్తి తరువాత అనుబంధము 5.

శూర్పణ. ఖరట—తిశాల

మః ంబలరెగద ఘనంబుగన్ - కమలనయను
నీలాకృతిరూపంబును - విమలదృష్టితో కనంగనంగను ॥మ॥
మహితగుణుడు - యీ - మారాకారుడు - పతియగుటకు
మేవడతి నిల్చెనో - గడయికమరు బాధలను
భరింపవ్ - వశమెరతీ సుఖమొందుదాన ॥మ॥

17 వ పేజి 12 వ పంక్తి తరువాత అనుబంధము 6.

లక్ష్మణుడు. బ్యాగ్ ఆది.

ఓసీ - పాపీ - కోరని కోరిక కోరెదవా -
పాడెదవా - ఆడెదవా - నీవిటులన్ ॥ఓ॥
మంచి పతించిన నెంచకషమ్మిటు - గిరీంద్రుదనమున త -
రించెదవా - ముక్కును - చెవులున్ -
గోసెదనిక - చనుమికను - వచ్చిన దూర్గముపవ్ ॥ఓ॥

20వ పేజి 8వపంక్తితరువాత అనుబంధము 7.

రావణుడు. మోహన—త్రిశ్రగతి.

నాదుసోదరిని శూర్పణఖ - నెలమిదనిమినట్టి పాపి -
నాదుగాత్మునింగూల్చెదవాహా హా హా ॥నా॥
మదమునను సతీలలామనిటుల - పరిభవమును సలిపి
నాశానమునిచే నిలనెటు - మనెదా - మృతునిశానలిపెద ॥నా॥

21వ పేజి మొట్టమొదట, అనుబంధము 8

రావణుడు. బ్యాగ్—ఆది

ఓకుటిలాత్మక - నారాయణుడని - నాకేలను వినబలికెదవా -
ధీరతనిస్సు వ - ధించిన సఫలం - బయ్యెదు
నాకార్యము లన్నింయుమా ॥ఓ॥

[illegible]

మారీచుడు

చిక్కిపడకుమా - విష్ణువతండగు దిట్టిన బ్రతుకగ -
1వ గాదెవ్వరికిని - పుట్టుగిట్టులకు మూలాధారుడు -
మూఢబుద్ధివిడనాడు మికస్ ॥మి॥

38 వ పేజి 18 పంక్తి అనుబంధము 9

సీత. బీన్ పలాస్—త్రిశ్రిగతి.

కనుగొనునాథా లేడిన్ - కనులకుమిరు మి -
క్లైనగె త్వరితముగను చనుమా - శిరమున -
5 నడప-జపదు - వెసగొనిరమ్మా ॥క॥

49 వ పేజి 8 వ పంక్తి తరువాత అనుబంధము 10

సీత. కామవర్ధని—ఆది.

నాకేమిదోచదోమరదీ - ప్రాణపతి యాలేడితో
పోయి యార్తనాదం బొనరించెను ॥నా॥
ప్రాణరక్షణము సేయుటకొరకై వడిగబొమ్మ
పుణ్యము నీకగులక్ష్మణ - నాపతిజాడంగను
నామానస మక్కట తొందరజెందుచుండె
పోపొమ్మ వేడెదను ॥నా॥

54 వ పేజి 14 వ పంక్తి తరువాత అనుబంధము 11.

లక్ష్మణుడు. భాగేశ్వరి—రూపకము.

జనవితగదు యిటులబలుక - కనుగొనంగా
దైత్యమాయలగును రామునకాపద - గలుగ
లోకమంతరించూ ॥జ॥
7 : కడుభయమును జెందబోకు - కన్నతల్లి హితమును
విను - అటుల సలుపవేని హాని - అమ్మరో
గలుగు వినుమా ।జ॥

68 వ పేజి 22 వ పంక్తి తరువాత అనుబంధము 12.

### సీత. రాగ్ —[illegible]

తెలిసెను తెలిసెను కపటము కుమతీ - పలువరతనము
విడువుము నీనీ - పగిదిని సాధ్వుని పోగరుతనము
ననుబిలువయఘము - తడయక చనుమా ॥తె॥
జగతీనాథుని సతినిటు చెరగొని - చనగను
తరమగు నటరా - కూళ శాసనము బాయుము
అదరక నడువుము - తడసిన హాత మగుదువురా ॥తె॥

రావణుడు

ఓ మరాళ గమన రామామణి నీ - మనోహరాకారం
బుం జూడంగను మన్మథుండు పూ - శరము గుప్పి
మరులు గనజేసె రావె బాలా ॥ఓ॥

104 వ పేజి 79 వ పంక్తి తరువాత అనుబంధము 13

సీత ముఖారి—ఆది.

ఓనాహృదయేశ్వరా ॥ఓ॥
మోసముచేసి దైతే - యుడు నీసతినిటు -
నెత్తుకపోవ - దారసిలెను - రవివంశజ నన్నీ -
రాక్షసవా - తనుండి బ్రోవుమా ॥ఓ॥
రామ శ్రీ - రామయా - రక్కసు - నడపవె -
కాలముమీరిన చచ్చిపోదు హా ॥ఓ॥

88 వ పేజి 18 వ పంక్తి తరువాత అనుబంధము 14

సీత. కాంభోజి—ఆది.

వినుమా సురవైరీ - కనికరమును - గనుమా నను
విడువుము ॥వి॥
పాపము పరసతినగుదును గాదా - పాడియె య-
య్యబలను చెరగొనిపోగా - రాక్షస మొర్రి క్కద నను
విడుమా ॥వి॥

98 వ పేజి 5 పంక్తి తరువాయి అనుబంధము 19

సీత. యమన్—ఆది

ఓరఘురామా - దైత్యవిరామా ॥ఓ॥
రావణుండుకొని - పోవుచుండెనకటా ॥ఓ॥
ఓకరుణాకర - నీసతిగావుము - నీకృపారసమేనా
జీవనాధారము ॥ఓ॥

(నాటకాంతమున జటాయువు కీర్తన)

కళ్యాణి—ఆది 20.

రామరామ రఘురామపరాత్పర - రాక్షస
సంహార - రణభీమా ॥రా॥
సమానవిరహిత రమారమణనుత -
విమోహనా నను గావవే ॥రా॥

సంపూర్ణము.

